

సమ్మక్క, సారలమ్మ - మేడారం జాతర
ఇన్‌సెట్‌లో-జాతరలో కీలకమైన
'గద్దె'ను ఉంచే చెట్టు



ప్యాట్రన్
కావూరు కుటుంబరావు




సంపుటి : 1 ఆగస్టు -సెప్టెంబర్ 2007 సంచిక : 10-11





**చిరునామా**
ఎడిటర్, **మామయ్య** బాలల మాసపత్రిక,
ఇం.నెం. 1-1-187/1/2, వివేక్‌నగర్, చిక్కడపల్లి,
హైదరాబాద్-500 020
ఫోన్: 040-27620887, ఫ్యాక్స్: 040-27620887
సెల్ : 94900 98903
mamayya_bs@yahoo.co.in,
**Website:** www.balasahityam.org

2011-2012/281

## సంపాదకీయం

# స్వాతంత్రం, స్వేచ్ఛ, సమానత్వం

హాయ్ బాలలు,

ఆగస్టు 15న మన దేశ 60వ స్వాతంత్ర దినోత్సవాన్ని జరుపుకున్నాం. జాతీయ జెండాను ఎగురవేశాం. స్వీట్లను తిన్నాం. ఆనందించాం. ఇదేనా స్వాతంత్రమంటే ? ఒక్కసారి ఆలోచించండి.

60 ఏళ్ల క్రితం ఈ రోజు మన దేశానికి స్వాతంత్రం వచ్చిందని, గాంధీ తాత నాయకత్వంలో బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా పోరాడి ఈ స్వాతంత్ర్యాన్ని సాధించుకొన్నామని, ఆ తరువాత కాలంలో మన దేశం ఎంతో అభివృద్ధి చెందిందని మాష్టార్లు చెప్పి వుంటారు. స్వాతంత్రమంటే ఏ ఇతర దేశాల పెత్తనం, ఆధిపత్యం లేకుండా మన దేశ విధానాలను మనమే స్వయంగా నిర్ణయించుకోవడం. అప్పుడే, స్వాతంత్ర్యానికి పూర్తి అర్థం. అనుభవంలోనే తెలుసుకోగలం.

1947 ఆగస్టు 15కు పూర్వం మన దేశం బ్రిటన్‌కు లోబడి వలస దేశంగా వున్నప్పుడు మన దేశ విధానాలను, చట్టాలను బ్రిటిష్ దేశ పాలకులకు లాభించే విధంగా వారి ప్రభుత్వమే నిర్ణయించేది. వీని ద్వారా మన ప్రజల ఆదాయాల్ని బ్రిటిష్ పాలకులు అనుభవించేవారు. మన ప్రజలకు ఏ హక్కులు ఉండేవి కావు. ప్రజలకు సరైన తిండి, బట్ట, ఇళ్ళు ఉండకపోయేవి. చదువుకొనే అవకాశాలు ఉండకపోయేవి. బ్రిటీష్ వారికి అనుచరులుగా ఉంటూ, డబ్బున్న కొద్ది మందికి అన్ని సౌకర్యాలు, గౌరవం, గుర్తింపు ఉండేవి. ఈ పాలనను 'పరతంత్రం'గా పిలుస్తున్నాం. ఈ పాలన అంతమై మనమే స్వయంగా నిర్ణయాలు తీసుకొని పాలించుకోవడాన్ని స్వాతంత్ర్యంగా పిలుస్తున్నాం.

స్వాతంత్రం వచ్చిన తరువాత పౌరులందరికి సమాన హక్కులను కలిపిస్తూ రాజ్యాంగాన్ని రాసుకున్నాం. పేదల అభివృద్ధి లక్ష్యంతో చదువుకునేందుకు స్కాలర్‌షిప్‌లను, రిజర్వేషన్‌లను కల్పించుకున్నాం. పరిశ్రమలను స్థాపించుకొన్నాం. అభివృద్ధి చెందాం. అయితే, ఇప్పటికి ఎంతో మందికి సరైన తిండి, బట్ట, ఇళ్ళు, విద్యా అవకాశాలు లేవు. అంటే స్వాతంత్ర ఫలాలు అందరికీ అందలేదు. ముఖ్యంగా పేదలకు అందలేదు.

పరిపూర్ణ అభివృద్ధికి స్వేచ్ఛ అవసరం. స్వేచ్ఛ అంటే తనకు నచ్చినదానిని నచ్చిన విధంగా ఏ ఆటంకంలేకుండా చేయగలగడం. అయితే ఈ చర్యలు ఇతరులకు ఆటంకం కలిగిస్తూ, వారి స్వేచ్ఛను అడ్డుకోరాదు. అందువల్ల అందరూ స్వేచ్ఛను అనుభవించాలంటే సమానత్వం కావాలి.

రాజ్యాంగం ఇచ్చిన స్వేచ్ఛ, స్వాతంత్రం ఈ రోజుల్లో డబ్బులున్న వారికే పరిమితమయ్యాయి. ఇవి పేద వారికి కూడా కావాలి. దీనికై సమానత్వం కావాలి. సమానత్వం మంటే, అభివృద్ధికి ఆటంకం లేని అవకాశాలుగా మనం అర్థం చేసుకోవాలి. ఈ అవకాశాలు అందరికీ వచ్చేలా కృషి చేయాల్సిన బాధ్యత మనందరిదీ.



# మన దేశ స్వాతంత్ర్య పోరాట చరిత్ర






ఇప్పుడు మన దేశ పోరాట చరిత్ర వింటే కథలాగే ఉంటుంది. కాని, చరిత్ర నిజంగా జరిగింది. దీనికి విరుద్ధంగా కథలో కొంతైనా కల్పితం ఉంటుంది. కథల నుండి బోలెడు విషయాలు తెలుసుకుంటాం. నేర్చుకుంటాం. అలాగే చరిత్ర ద్వారా ఎన్నో విషయాలను తెలుసుకుంటాం. నేర్చుకుంటాం. అందువల్ల మన దేశ పోరాట చరిత్రను ప్రతీ ఒక్కరూ అధ్యయనం చేయాలి.

ఏ దేశ చరిత్రనైనా ఆ దేశ ప్రజలే రూపొందిస్తారు. కేవలం అనుభవం, ముందు చూపుతో నాయకులు తమ దేశ ప్రజల కోరికలను అవసరాలను గుర్తించి దానికి అనుగుణంగా కార్యక్రమం రూపొందించి, తమ ప్రజల సమస్యల పరిష్కారానికి కృషి చేస్తారు.

మన స్వాతంత్ర్య పోరాట చరిత్ర ఎంతో మంది త్యాగమూర్తులను, నాయకులను మన ముందు ఉంచింది.



కోట్లాది ప్రజలు కష్టపడ్డారు. వేలాది మంది త్యాగాలు చేయాల్సి వచ్చింది. లెక్కలేనంత మంది నాయకులు తోటి వారిలా బాధలను అనుభవిస్తూ ప్రజలకు నాయకత్వం వహించారు. ఎంతో మంది చనిపోయారు. నష్టపోయారు. వీరి త్యాగం, పడ్డ కష్టాలు మనం ఎప్పుడూ గుర్తుకు తెచ్చుకోవాలి. వీరి స్మృతిని గౌరవించాలి.

మన దేశ స్వతంత్ర పోరాట చరిత్ర అనగానే ఇప్పుడు కొద్దిమంది నాయకుల గురించే చెబుతుంటారు. గాంధీ తాత చేసిన శాంతియుత సత్యాగ్రహ పోరాటం వలన మనకు స్వాతంత్ర్యం వచ్చిందని కొంతమంది ఇప్పుడు చెప్తుంటారు. ఇది పూర్తి వాస్తవం కాదు. బ్రిటీష్ పాలకులపై చేసిన ప్రతీ పోరాటం మన దేశ స్వాతంత్ర్యానికి తోడ్పడింది. గాంధీ తాత శాంతియుత సత్యాగ్రహ పోరాటం స్వాతంత్ర్య పోరాటం చివరి దశలో వచ్చింది. పెద్దయెత్తున సామాన్యులు దేశ స్వాతంత్ర్య పోరాటంలోకి నమీకరించడానికి శాంతియుత సత్యాగ్రహం తోడ్పడింది.

మతం, కులాలకతీతంగా ప్రజలు స్వతంత్ర పోరాటంలో పాల్గొన్నారు. వీరనారి ఝూన్సీలక్ష్మీబాయి, భగత్‌సింగ్, సుభాష్ చంద్రబోస్ లాంటి నాయకులు బ్రిటీష్ పాలకులను ఎదిరించడంలో ప్రజలకు, ముఖ్యంగా యువకులకు ఎంతో ఉత్తేజాన్ని ఇచ్చారు. అతి చిన్న వయసులో భగత్‌సింగ్ చేసిన పోరాటం, ప్రాణత్యాగం ఇప్పటికీ యువతకు ఎంతో స్ఫూర్తినిస్తుంది. అన్యాయాన్ని సామ్రాజ్యవాద శక్తులను ఎదుర్కోవడంలో భగత్‌సింగ్ నేటికీ యువతకు ఆదర్శప్రాయంగా ఉన్నాడు.

సుభాష్ చంద్రబోస్ భారత జాతీయ సేనను నేరుగా ఏర్పాటు చేసి శత్రువుకు శత్రువు మిత్రుడు అనే సూత్రం ఆధారంగా జపాన్, జర్మనీల సహకారంతో బ్రిటీష్ వారిపై యుద్ధాన్ని ప్రకటించాడు. మన దేశ స్వాతంత్ర్య పోరాటానికి సహకరించేలా ఒప్పందాలు కుదుర్చుకొన్నాడు. అందువల్ల పెద్దవారయ్యాక బాలలందరూ మన స్వాతంత్ర్యపోరాటాన్ని బాగా అధ్యయనం చేయాలి. పరాయిపాలనలో మన దేశ ప్రజలు పడిన కష్టాలను, నష్టాలను గుర్తించాలి. ఈ అనుభవాలు మన భవిష్యత్తును తీర్చిదిద్దుకోవడానికి ఎంతో తోడ్పడతాయి.

నేడు ప్రపంచీకరణ పేరుతో మన దేశ విధానాల నిర్ణయంలో పెరుగుతున్న విదేశీ శక్తుల పాత్ర "మనం సాధించుకున్న స్వాతంత్ర్యాన్ని ఇకముందు కూడా నిలబెట్టుకోగలమా?" అనే సందేహాలను కొంతమందిలోనైనా కలుగుజేస్తుంది. అందువల్ల మన దేశ చరిత్ర అనుభవాలను మనం అధ్యయనం చేయాలి. మన చరిత్రే మనను ఆలోచింపచేసి, వచ్చిన స్వాతంత్ర్యాన్ని కాపాడుకోవడంలో సహాయ పడుతుందని ఆశిద్దాం.





# పంద్రాగస్టు పండుగ

- జ్యోతిర్మయి

"రాధా...! పొద్దున్నే పుస్తకాలన్నీ ముందేసుకొని ఏం చేస్తున్నావు?" అడిగాడు తాతయ్య.

"రేపు స్వాతంత్ర్య దినోత్సవం కదా తాతయ్య. అందుకని మా స్కూల్లో ఆటల పోటీలు పెడ్తున్నారు. దాంతోపాటే వ్యాసరచన పోటీలు కూడా నిర్వహిస్తున్నారు. నేను కూడా అందులో పాల్గొంటున్నాను. అందుకోసమే ప్రిపేరవుతున్నాను" చెప్పింది రాధ.

"చాలా మంచి పని చేస్తున్నావు. ఇంతకీ వ్యాసరచన పోటీ ఏ అంశం మీద?" అడిగాడు తాతయ్య.

"స్వాతంత్ర్య సంగ్రామం మీద తాతయ్య" బదులిచ్చింది రాధ.

"హిస్టరీ పుస్తకాలన్నీ ముందేసుకుంది అందుకోసమేనా?" మళ్లీ అడిగాడు తాతయ్య.

"ఔను. కానీ ఈ పాఠాలన్నీ ఇప్పటికిప్పుడు చదవాలంటే సమయం సరిపోదు. నువ్వు నాకేమైనా సాయం చేయగలవా తాతయ్య?" అడిగింది రాధ.

"ఏ రకమైన సహాయమో చెప్పు"



అన్నాడు తాతయ్య.

"మన స్వాతంత్ర్య సంగ్రామాన్ని గురించి నీకు తెలిసింది చెప్పు" అంది రాధ.

''అలాగే చెప్తాను. అయితే స్వాతంత్ర్య సంగ్రామం గురించి తెలుసుకునే ముందు అందుకు దారి తీసిన పరిస్థితుల గురించి చూచాయగా చెప్పుకోవాలి. పూర్వం మన దేశం చిన్న చిన్న రాజ్యాలుగా విడిపోయి ఉండేది. అలాంటి సమయంలో పాశ్చాత్యులు వ్యాపారం నిమిత్తం ఇక్కడికొచ్చారు. సకల సంపదలతో తులతూగుతున్న భారతదేశం వారిని ఆకర్షించింది. ఇక్కడి రాజులతో స్నేహం పెంచుకున్నారు. తమ వ్యాపారానికి అనువుగా పరిస్థితుల్ని మలచుకున్నారు. మెల్లగా వారి దృష్టి పరిపాలనవైపు మళ్లింది. రకరకాల ఎత్తుగడలతో ఒక్కొక్క రాజ్యాన్నే ఆక్రమించుకోసాగారు. ప్రమాదాన్ని పసిగట్టిన కొంతమంది రాజులు, సంస్థానాదీశులు వీరి దూకుడుకు కళ్లెం వేయాలని చూశారు. కానీ మనవాళ్లలో వున్న అనైక్యత శత్రువుకు ఆయుధంగా మారింది. దానికితోడు వాళ్ల దగ్గర అత్యాధునిక యుద్ధ సామాగ్రి కూడా ఉంది. పైగా మనవాళ్లలోనే విదేశీయులకు సాయం చేసే వాళ్లూ ఉన్నారు. ఇవన్నీ కలిసి శత్రువును బలవంతుణ్ణి చేశాయి. దాంతో మన దేశం పరాయి పాలకుల పరమైంది" ఆగాడు తాతయ్య.



"ఆ తర్వాత..." అడిగింది రాధ.

''వ్యాపారం పేరుతో మన సంపదనంతా వాళ్ల దేశానికి తరలించారు. మనవాళ్లను బానిసల్ని చేశారు. రకరకాల పన్నులు విధించారు. ప్రజల్ని నానా రకాల ఇబ్బందులు పెట్టారు. కానీ... బ్రిటీష్‌వాళ్లు మనకు కీడుతోపాటు కొంత మేలు కూడా చేశారు" చెప్పాడు తాతయ్య.

"అదేంటి తాతయ్య?!" ఆశ్చర్యంగా అడిగింది రాధ.

"బ్రిటీష్‌వాళ్ల దగ్గర మనవాళ్లు పని చేసేవాళ్లు. వాళ్లతో ఏమైనా మాట్లాడలన్నా, ఏదైనా పని అప్పచెప్పాలన్నా భాష పెద్ద అడ్డంకిగా ఉండేది. ఆ అడ్డంకుల్లేకుండా వుండడం కోసమని పాఠశాలలు పెట్టించారు. దాంతో మనవాళ్లు చదువుకునే అవకాశం కలిగింది. కొంతమంది పై చదువుల కోసం విదేశాలకు కూడా వెళ్లారు. అలా మనవాళ్లకు అంతర్జాతీయ పరిస్థితులు, ఆయా దేశాల్లో బ్రిటీష్‌వారి బలాబలాల గురించి తెలుసుకునే అవకాశం కలిగింది. వాళ్లల్లో చాలామంది స్వదేశానికి తిరిగొచ్చాక స్వాతంత్రోద్యమంలో పాల్గొనడంతోపాటు దానికి సారథ్యం కూడా వహించారు.

ఇంకా... బ్రిటీష్ వాళ్ల సరుకుల రవాణా, సమాచారాన్ని చేరవేయడం కోసం రవాణా సౌకర్యాలు కల్పించారు. ఉత్తర ప్రత్యుత్తరాలు నెరపడానికి తపాలా వ్యవస్థను ఏర్పాటు చేశారు. ఇలా మరికొన్ని సౌకర్యాలు కూడా మనవాళ్లకు అందుబాటులోకి వచ్చాయి. ఇవన్నీ మనకు స్వాతంత్రోద్యమ



కాలంలో మనవాళ్లకు బాగా ఉపయోగపడ్డాయి" వివరించాడు తాతయ్య.

"అంటే... బ్రిటీష్‌వాళ్లు వాళ్ల వేలితో వాళ్ల కన్నే పొడుచుకున్నారన్నమాట'' సాలోచనగా అంది రాధ.

"ఒకరకంగా అలాగే అనుకో'' అన్నాడు తాతయ్య.

"అద్సరేగానీ తాతయ్యా... ఇంతకీ స్వాతంత్రోద్యమం ఎలా మొదలైంది?'' అడిగింది రాధ.

"అక్కడికే వస్తున్నా. ఆది నుండి బ్రిటీష్‌వాళ్లను మనవాళ్లు ఎదిరిస్తూనే ఉన్నారు. తాంతియా తోపే, నానాసాహెబ్, ఝాన్సీలక్ష్మీబాయి, అల్లూరి సీతారామరాజు లాంటి వాళ్లంతా తెల్లవాళ్లను ప్రతిఘటించిన వాళ్లే. అయితే మనవాళ్లు చేసిన తిరుగుబాట్లు కొన్ని ప్రాంతాలకే పరిమితమయ్యేవి. బ్రిటీష్‌వాళ్లు వాటిని తేలిగ్గా అణచేసేవారు. పైగా మన వాళ్లకు వాళ్లకున్నంత క్రమశిక్షణగానీ, ఆయుధ సామాగ్రిగానీ లేదు. ఇవిగాక ఇంకొన్ని కారణాల వల్ల మనవాళ్లు చేసినా పోరాటాలు విఫలమయ్యాయి" చెప్పాడు తాతయ్య.



"మరి బ్రిటీష్‌వారిని ఎదిరించడం ఎలా వీలయ్యింది?"

"ఇరవయ్యవ శతాబ్దం మొదలయ్యే నాటికి దేశంలో పరిస్థితులు మారాయి. ప్రజల్లో చైతన్యం వచ్చింది. దేశభక్తి ప్రబలింది. పరాయి పాలకులను దేశం నుండి తరిమెయ్యాలనే ఆలోచన పుట్టింది. అదే స్వాతంత్రోద్యమానికి నాంది అయ్యింది. బాలగంగాధరతిలక్, బిపిన్ చంద్రపాల్, లాలాలజపతిరాయ్, అనిబిసెంట్‌లాంటి వారు దానికి నాయకత్వం వహించారు. నెహ్రూ, గాంధీ... తదితరులు తర్వాత ఉద్యమంలో చేరారు. ఆ క్రమంలోనే జాతీయ కాంగ్రెస్ ఆవిర్భవించింది. గాంధీ నాయకత్వంలో స్వాతంత్రోద్యమానికి కొత్త రూపం వచ్చింది. ఆయన చెప్పిన అహింసాయుత పోరాటం మనవాళ్లకు నచ్చింది. ఎందుకంటే... ఆయన అహింసతోనే దక్షిణాఫ్రికాలో జాతివివక్షకు వ్యతిరేకంగా పోరాడారు. విజయం సాధించారు. క్విట్ ఇండియా, ఉప్పు సత్యాగ్రహం, సహాయ నిరాకరణోద్యమాలు మొదలైనవన్నీ గాంధీ నాయకత్వంలో చేసినవే.

అయితే అన్ని సమస్యలకు అహింస ఒక్కటే పరిష్కారం కాదనే వారూ ఉన్నారు. ప్రాణానికి ప్రాణమే సమాధానమంటూ ఆ దారిలో నడిచిన వారూ ఉన్నారు. బ్రిటీష్ సైన్యంలోని మనవాళ్లు కూడా జాతీయోద్యమానికి రహస్యంగా సహాయసహకారాలు అందించేవారు. మన జాతీయ నాయకులను అంతమొందించడానికి బ్రిటీష్‌వాళ్లు రూపొందించిన పథకాన్ని బట్టబయలుచేసి, మనవాళ్లను రక్షించింది కూడా వాళ్లే. అసలు రహస్యం బయటపడితే ఏం జరుగుతుందో వాళ్లకు తెలుసు. అన్నీ తెలిసి కూడా వాళ్లింతటి సాహసానికి ఒడిగట్టారంటే వాళ్ల



ధైర్యసాహసాలను మెచ్చుకోక తప్పదు.

ఇవన్నీ గమనించిన తర్వాత ఇక ఇక్కడ తమ ఆటలు సాగవని బ్రిటీష్‌వారికి అర్థమైంది. మరోవైపు అంతర్జాతీయ పరిస్థితుల్లోనూ మార్పొచ్చింది. మొదటి, రెండు ప్రపంచ యుద్ధాలు బ్రిటన్ ఆర్థిక పరిస్థితిని దిగజార్చాయి. సాధించిన విజయాల మాటేమోగానీ వాళ్ల ఆధీనంలోని అన్ని దేశాల ప్రజలు పోరుబాట పట్టారు. అన్ని చోట్ల అధికారాన్ని సుస్థిరం చేసుకోవడం బ్రిటన్‌కు తలనొప్పిగా మారింది.



ఇలా అన్ని రకాల ఒత్తిడుల కారణంగా ఆంగ్లేయులు మన దేశాన్ని వదిలిపెట్టి వెళ్లక తప్పలేదు" ముగిస్తూ అన్నాడు తాతయ్య.

"ఒక్క గాంధీగారి వల్లే స్వాతంత్రమొచ్చేసిందనుకున్నా. చూడబోతే బ్రిటీష్‌వాళ్లు వెళ్లిపోవడానికి చాలా కారణాలే ఉన్నాయన్నమాట" సాలోచనగా అంది రాధ.

"అవును. అవన్నీ పై తరగతుల పాఠాల్లో వివరంగా ఉంటుంది. అప్పుడు చదువుకోవచ్చు. ప్రస్తుతానికి నీ వ్యాసానికి సరిపడా గ్రాసం దొరికింది కదూ" అన్నాడు తాతయ్య.

"ఊ... థాంక్స్ తాతయ్యా! అమ్మో... స్కూల్‌కి టైమైంది. నేను వెళ్తున్నా" అంటూ పుస్తకాలు తీసుకొని ఇంట్లోకి పరుగెత్తింది రాధ.

## మామయ్య బాలల మాస పత్రిక చందా వివరాలు

హలో! చిన్నారి నేస్తాలూ! మామయ్య పత్రిక ఇక నుంచీ మీదే. ఈ మామయ్య పత్రికలో మీ కోసం బోలెడు కథలు, బొమ్మలు, సైన్స్ కబుర్లు, సామెతలు, పొడుపు కథలూ, జోకులూ, పాటలూ, పజిల్స్ ఇంకా చాలా చాలా ఉంటాయి. ఈ పత్రిక నెల రు. 10/- – మీరు ఎంచక్కా ఏడాదికి చందా కడితే నెల నెలా వచ్చేస్తుంది. ఏజెంటు ద్వారా ఏడాది చందా రు. 120/-. పోస్టు ద్వారా కావాలంటే రు. 150/-. అన్నట్టు మీరు కూడా దీనికి రచనలు పంపవచ్చు. చిన్నారి పాఠకులకు మామయ్య ఎలా వుంటే బావుంటుందో కూడా మీరు రాయొచ్చు. మరిక మీ అమ్మానాన్నలకు చెప్పి వెంటనే చందా పంపించండి. మీ స్నేహితులకు కూడా చెప్పాలి. మన పిల్లల కోసం వస్తున్న మామయ్యకు స్వాగతం చెప్పాలి. మామయ్య అన్ని ప్రజాశక్తి బ్రాంచీల్లో, ఇతర పెద్ద బుక్ షాపుల్లో దొరుకుతుంది. లేదా, నేరుగా 'మామయ్య'ను సంప్రదించండి.

**చిరునామా**

**మేనేజర్,** మామయ్య బాలల మాసపత్రిక
1-1-187/1/2, వివేక్‌నగర్, చిక్కడపల్లి, హైదరాబాద్ – 500 020,
ఫోన్ : 040-27620887, ఎడిటర్ సెల్ : 94900 98903



# మొదటి భారత స్వాతంత్ర్యపోరాటం

హాయ్ ఫ్రెండ్స్, ఇది నిజంగా జరిగిన కథ. సరిగ్గా 150 సంవత్సరాల క్రితం జరిగింది. ఎన్నో కథల్లో మంచి రాజులు, చెడ్డ రాజులు ఉన్నారు. మంచి రాజులు తమ ప్రజల సుఖం, సంతోషాల కొరకు పని చేసేవారు. చెడ్డ రాజులు తమ ప్రజలను అష్టకష్టాలను పెట్టి, పీడించి, అధిక పన్నులతో, కూలి ఇవ్వకుండానో పని చేయించుకొని బాధించేవారు. ఎదిరించిన వారిని అతి క్రూరంగా శిక్షించేవారు. లేదా చంపివేసేవారు. అయినా, ఎంతో మంది ఏదో ఒక సమయంలో భయపడకుండా దుష్టరాజులపై తిరగబడే వారు. ఎదిరించేవారు. చివరకు దుష్టరాజు ఓడిపోయినా, ఈ లోపుల మాత్రం ఎంతో మంది ప్రాణాలు కోల్పోయేవారు. చెడ్డరాజు ఓడిపోయిన తరువాత ప్రజలు ఆనందంగా గడిపేవారు. అలాంటిదే ఇపుడు చెప్పే కథ.

ఇప్పటికి కొన్ని వందల సంవత్సరాల క్రితం మన దేశానికి 'బ్రిటన్' అనే దేశం నుండి ఈస్ట్ ఇండియా అనే కంపెనీ వ్యాపారం చేయడానికి వచ్చింది. వ్యాపారాన్ని పెంచుకోడానికి మొదట మన దేశంలో ఉన్న రాజులతో మంచిగా వుంది, ప్రజల నుండి మాత్రం బాగా లాభాలు సంపాదించేది. ఈ లాభాలను తమ ఇష్టం వచ్చినట్లు పెంచుకోడానికి రాజులను



లోబరుచుకునేది. ఇలా వినని వారితో యుద్ధం చేసి ఓడించి తాము ఏమి చెబితే అలా చేసే వారిని పాలకులుగా నియమించి, వెనుకనుంచి తామే పాలించేవారు. ఆ తరువాత నేరుగా రాజుల నుండి రాజ్యాలను స్వాధీనం చేసుకొని అతి క్రూరంగా ప్రజలను కొల్లగొట్టేవారు. ఈస్ట్ ఇండియా కంపెనీ తన దుష్టపాలనను మన దేశంలో విస్తరింపచేసుకుంది. లక్షల మంది సైన్యాన్ని కూడా ఏర్పరచుకొంది. ఈ విధంగా బ్రిటిష్ వారు మన దేశాన్ని పూర్తిగా ఆక్రమించుకొన్నారు. తమ సరుకులను, ముఖ్యంగా వస్త్రాలను, ఇతర వస్తువులను మన దేశంలో అమ్మి లాభాలు పొందేవారు. ఈ విధంగా మన కళాకారులను, గ్రామాల్లో ఇతర పనులు చేసుకొని జీవించేవారిని, వ్యవసాయాన్ని దివాలా తీయించారు. ఇలా



ఒక పరాయి దేశం ఇతర దేశాన్ని స్వాధీనం చేసుకొని, పెత్తనం చేస్తూ, కొల్లగొట్టే దేశాలను సామ్రాజ్య దేశాలుగా పిలుస్తాం. వీరివల్ల బాధపడే దేశాన్ని వలస దేశంగా పిలుస్తున్నాం. అంటే ఈస్ట్ ఇండియా కంపెనీ ఆక్రమణ ద్వారా బ్రిటన్ సామ్రాజ్య దేశం అయ్యింది. మన దేశం వలస దేశంగా మార్చబడింది. మన దేశ ప్రజలు వలస వారుగా ఎన్నో కష్టాలను అనుభవించారు. చివరకు భరించలేక ఈస్ట్ ఇండియా కంపెనీ పాలనపై తిరగపడటం ప్రారంభించారు. పోరాటం ప్రారంభించారు. ఈ పోరాటం ప్రారంభం నుండి చివర వరకు ఆగకుండా జరగలేదు. పోరాడాం. ఓడిపోయి తిరిగి పోరాడాం. చివరకు గెలిచాం. బ్రిటిష్ పాలకులు ఓడిపోయారు. దేనినీ మనం స్వాతంత్రం పోరాటంగా పిలుస్తున్నాం.

19వ శతాబ్ద ప్రారంభం నుంచి ఈస్ట్ ఇండియా కంపెనీ మీద పోరాటం జరిగింది. మొదట వేర్వేరు ప్రాంతాలలో మనవారు అందరూ ఒకేసారి పోరాడలేదు. వారివారి శక్తిని బట్టి వారు వేర్వేరుగా ఈస్ట్ ఇండియా పాలకులపై పోరాడేవారు. ఇలా





నేటికి సరిగ్గా 150 సంవత్సరాల క్రితం, అంటే 1857లో ఈస్ట్ ఇండియా పాలకులపై పెద్ద ఎత్తున కష్టపడుతున్న ప్రజానీకం, వారి రాజులు, ఒకేసారి ఎదురు తిరిగి పోరాడారు. కంపెనీ సైన్యానికి ఆధునిక ఆయుధాలున్నాయి. మనలో విద్రోహులు తమ స్వార్థం కోసం మన శత్రువులకు అంటే బ్రిటిష్ వారికి, సహాయ పడ్డారు. అందుకనే మనం ఓడిపోయాము. ఈస్ట్ ఇండియా కంపెనీ సైన్యంలో పని చేస్తూ మన దేశస్తులు కంపెనీ పాలకులపై ఎదురు తిరిగారు. పోరాడారు. దీనిని "సిపాయి తిరుగుబాటు" అని బ్రిటిష్ వారు రాసిన చరిత్ర పుస్తకాలలో వివరించారు. అయితే, ఈ తిరుగుబాటు కేవలం సైనికులకే పరిమితం కాక, లక్షల మంది ప్రజలు కూడా పాల్గొన్నారు. ఎంతో మంది పోరాడుతున్న సైనికులకు సహాయం అందించారు.

ఈ యుద్ధంలో ఎంతో మంది రాజులు, రాణులు చంపివేయబడ్డారు. ఇలా చంపివేయబడ్డవారిలో నానాసాహెబ్, మంగళ్‌పాండే, బేగం హజ్రత్‌మహల్, ఝాన్సీ లక్ష్మీబాయి, కున్వర్‌సింగ్, తాంతియాతోపేలు





ముఖ్యులు. ఈ పోరాటంలో మన వారు ఓడిపోయారు. ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకులు గెలిచారు. ఈ పోరాటాన్నే మనం మొదటి స్వాతంత్ర పోరాటంగా పిలుస్తున్నాం.

ఈ పోరాటంలో హిందువులు, ముస్లింలు అనే భేదం లేకుండా అందరూ కలిసి శత్రు సైన్యంపై పోరాడారు. మన శత్రువులకు మంచి ఆయుధాలున్నాయి. యుద్ధానికి అవసరమైన ఇతర వనరులు ఉన్నాయి. మనలో వున్న కొందరు స్వార్థపరులు, ప్రాణాలకు భయపడిన వారు శత్రు సేనలకు సహాయం చేశారు. అందువల్ల మనం ఓడిపోయాం. గెలిచిన ఈస్ట్ ఇండియా కంపెనీ సైన్యం ఎన్నో వేలాది మందిని ప్రజలను ఊచకోత కోసింది. లక్షల మంది గాయపడ్డారు.



మొదట స్వాతంత్ర పోరాటంలో మనం ఓడిపోయినా, శత్రువులపై పోరాడిన వారు చూపించిన ధైర్యసాహసాలు, పోరాట పటిమ, పరదేశస్తుల పాలన నుండి విముక్తి పొందాలనే కాంక్ష బలపడింది. ఆ తరువాత బ్రిటన్ పాలకులపై చేసిన పోరాటాలకు స్ఫూర్తిగా పని చేశాయి. ఈ స్ఫూర్తితో ఎంతో మంది బ్రిటిష్ దుష్టపాలకులపై పోరాడారు. ఎన్నో చోట్ల ఎంతో మంది ఇలా పోరాడారు. చివరకు ఈ పోరాటం దేశం మొత్తం వ్యాపించి, 90 సంవత్సరాల తరువాత 1947 ఆగస్టు 15న బ్రిటష్ పాలన నుండి మనకు స్వాతంత్రం వచ్చేలా చేసింది.





# వీరనారి ఝాన్సీలక్ష్మీబాయి

ఝాన్సీ లక్ష్మీబాయి పేరు వినగానే మొదట గుర్తుకు వచ్చేది 1857లో జరిగిన మన దేశ మొదటి స్వాతంత్ర్య పోరాటం. ఈ పేరు వినగానే ఒళ్ళు గగుర్పొడుస్తుంది. ఒక విధమైన ఆవేశం, ఉత్సాహం కలుగుతాయి. ఈమె ప్రేరణతో స్వతంత్ర్య పోరాటం ఆ తరువాత కాలంలో ఎంతో మంది తమ పిల్లలకు ఝాన్సీ లేదా ఝాన్సీ లక్ష్మీబాయి అని పేర్లు పెట్టుకున్నారు. ఈ ఒరవడి కొనసాగుతుంది. అందువల్ల, బాలలందరూ ఈ వీరనారి చరిత్రను తెలుసుకోవాలి.

మన దేశ మొదటి స్వాతంత్ర్య పోరాటం 1857లో జరిగింది. అంటే, ఇప్పటికి సరిగ్గా 150 సంవత్సరాల క్రితం ఈ పోరాటం జరిగింది. ఈ పోరాటంలో లక్షల మంది సైనికులు, ప్రజలు పాల్గొన్నారు. వేల మందిని బ్రిటీష్ సైనికులు చంపేశారు. ఈ యుద్ధంలో మనం, అంటే భారతీయులం, ఓడిపోయాం. బ్రిటిష్ పాలకులు గెలిచారు. అయినా, ఈ పోరాటంలో మొదటగా గుర్తుకు వచ్చేది ఝాన్సీలక్ష్మీబాయి. ఈమె ఇలా ఎందుకు మొదటగా గుర్తుకొస్తుంది. ఈ కథను నేటి బాలలు తెలుసుకోవాలి. ఈ పోరాటంలో పోరాడుతూ ఝాన్సీలక్ష్మీబాయి చనిపోయింది. ఝాన్సీ లక్ష్మీబాయి ప్రదర్శించిన ధైర్యం, పోరాడిన తీరు ఈమెను గొప్ప నాయకురాలిగా వీరనారిగా గుర్తుంచుకునేలా చేసింది.

ఝాన్సీ లక్ష్మీబాయి అతి సామాన్య బ్రాహ్మణ కుటుంబంలో పుట్టింది. ఈమె తండ్రి మోరోపంత్ తాంబే. తల్లి భగీరథీ బాయి. ఝాన్సీ లక్ష్మీబాయికి తల్లి తండ్రులు పెట్టిన అసలు పేరు మణికర్ణిక. కానీ పెళ్ళి అయిన తరువాత మణికర్ణిక పేరును అత్తవారు లక్ష్మీబాయిగా మార్చారు. ఝాన్సీ అనే రాజ్య అధికారాన్ని చేపట్టిన తరువాత లక్ష్మీబాయి ఝాన్సీ లక్ష్మీబాయిగా మారింది.

ఝాన్సీ లక్ష్మీబాయి తండ్రి, తాతలు పేష్వాల కింద సైనిక కమాండర్లుగా పని చేసేవారు. అప్పటి పేష్వాలంటే రాజులా అన్ని అధికారాలు చెలాయించేవారు. కానీ, లక్ష్మీబాయి పుట్టేనాటికి, పేష్వాలు తమ అధికారాలను చాలా వరకు కోల్పోయారు.

లక్ష్మీబాయి నాలుగో ఏటే తల్లి





చనిపోయింది. తండ్రి ఇంకో పెళ్ళి చేసుకోలేదు. ఆ తరువాత 'బిదు' అనే గ్రామానికి బాజీరావు పిలుపు మేరకు లక్ష్మీబాయి తండ్రి మోరో పంత్ వెళ్ళాడు. అక్కడ బాజీరావు పెంపుడు కొడుకు నానాసాహెబ్‌కు మోరోపంత్ సైనిక శిక్షణ ఇచ్చారు. ఆ సమయంలో, నానా సాహెబ్‌తోపాటు లక్ష్మీబాయి కూడా సైనిక శిక్షణ పొందింది. గుర్రపుస్వారీ, కర్ర, కత్తి సాములు నేర్చుకుంది. ఈ సైనిక శిక్షణ కష్టకాలంలో లక్ష్మీబాయికి బ్రిటిష్ సైన్యంతో పోరాడడానికి ఉపయోగపడింది. ఈ శిక్షణే లక్ష్మీబాయికి ధైర్యాన్నిచ్చింది. ఎంతో నైపుణ్యాన్ని ఇచ్చింది.

లక్ష్మీబాయి పెళ్ళి ఝాన్సీ ప్రభువు గంగాధరరావుతో అయింది. పెళ్ళైన కొత్తలో లక్ష్మీబాయిగా మారిన మణికర్ణిక పూజలు, పురాణాలతో కాలక్షేపం చేసేది. కానీ, భర్త చనిపోయి బ్రిటీష్ సైన్యాన్ని ఎదిరించాల్సిన అవసరం ఏర్పడినప్పుడు ఎవరూ ఊహించని విధంగా లక్ష్మీబాయి పోట్లాడింది. ఎన్నో రెట్లు అధిక శక్తిగల బ్రిటిష్ సైన్యాన్ని చూసి లక్ష్మీబాయి భయపడలేదు. కష్టకాలంలో నిబ్బరంగా తనకు అన్యాయం చేసిన దుష్టశక్తులతో పోరాడింది. వీరమరణం పొందింది. తను రాణినని భావించి కోటలో కూర్చొని కేవలం సైన్యానికి ఆజ్ఞలు ఇవ్వటానికే పరిమితం కాకుండా కత్తిపట్టి భీషణంగా పోరాడింది. పోరాడే సమయంలో తన పదేళ్ళ కొడుకును వీపున కట్టుకొని గుర్రంపైస్వారీ చేస్తూ బ్రిటిస్ సైన్యంపై కత్తి దూసింది. ఈ యుద్ధంలో 22-23 ఏళ్ళకే చనిపోయింది. ఈ విధంగా లక్ష్మీబాయి చిన్న వయసులోనే వీరస్వర్గం పొందింది. వీరనారిగా చరిత్రలో స్థానం నిలుపుకుంది.

మరి వీరనారి ఝాన్సీ లక్ష్మీబాయి కథ విన్న తరువాత కూడా ఆడవాళ్ళంటే బలంలేని వారని, అబలలని, ధైర్యంలేనివారని అనుకుందామా? ఎవరైనా ఇలా అంటే ఒప్పుకుందామా? అందువల్ల ప్రతి బాల, బాలిక అవసరం వచ్చినప్పుడు ధైర్యంతో శత్రువు పై పోరాడడానికి వెనుకాడకూడదు. ఝాన్సీ లక్ష్మీబాయిలాగా ఎదురించాలి. అప్పుడే బాలలు గొప్పవారుగా పెరుగుతారు.

# ఉత్తమ ఉపాధ్యాయుడు

- క్రాంతి

"రాజేష్! నీకీ విషయం తెలుసా?" ఇంటి ముందున్న అరుగు మీద నిలబడి ముఖం కడుక్కుంటున్న స్నేహితుణ్ణి అడిగాడు విశాల్.

''ఏంట్రా?!'' ఆశ్చర్యంగా అడిగాడు రాజేష్.



"మన శ్రీనివాసరావు మాష్టారికి ఉత్తమ ఉపాధ్యాయుడు అవార్డు వచ్చిందట. మా నాన్న చెప్పారు" తనకు తెలిసిన విషయాన్ని మిత్రుడికి చెప్పాడు విశాల్.

"అవునా? మరి అవార్డు ఎప్పుడిస్తారు?" కుతూహలంగా అడిగాడు రాజేష్.

"రేపు ఐదవ తారీఖున ఉపాధ్యాయ దినోత్సవం నాడు అవార్డును ఇస్తారు" అని చెప్పాడు విశాల్.

"సెప్టెంబర్ ఐదునే ఎందుకని? ఏ ఆగస్టు పదిహేనుకో, రిపబ్లిక్‌డే రోజో ఇవ్వొచ్చుగా" అమాయకంగా అడిగాడు రాజేష్.

"ఏమో నాకూ తెలీదు" అరుగు మీద కూర్చుంటూ అన్నాడు విశాల్.

అప్పుడే పేపర్ అబ్బాయి సైకిల్ బెల్ మోగించుకుంటూ వచ్చాడు. ఆ శబ్దం విని, పేపర్ కోసం బయటికొచ్చాడు వెంకట్ మామయ్య. అరుగు మీద తీరిగ్గా కూర్చొని కబుర్లు చెప్పుకుంటున్న వీళ్లిద్దర్నీ చూశాడు.

"ఏంట్రా... పొద్దున్నే ట్యూషన్‌కి వెళ్లకుండా ఇక్కడ కూర్చున్నారు?" అని అడిగాడు.

"మాష్టారు ఊరెళ్లారు మామయ్య. అందుకే ట్యూషన్‌కి సెలవిచ్చారు" కూర్చోమన్నట్లు పక్కకు జరుగుతూ చెప్పాడు విశాల్.

"అలాగా..." అంటూ పేపర్ చదవసాగాడు వెంకట్.

ఇంతలో విశాల్ ఏదో గుర్తొచ్చినట్లు, "మామయ్యా! ఉత్తమ ఉపాధ్యాయుల్ని ప్రభుత్వం సెప్టెంబర్ ఐదవ తేదీనే సన్మానిస్తుంది. ఎందుకని?" అని అడిగాడు.

"ఆ రోజు మన మాజీ రాష్ట్రపతి డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణగారి పుట్టినరోజు. ఆయన గొప్ప రాజనీతిజ్ఞుడు. మంచి మాష్టారు కూడా. అందుకే ఆయన జ్ఞాపకార్థం ప్రతి సంవత్సరం సెప్టెంబర్ ఐదవ తేదీన "ఉపాధ్యాయదినోత్సవం" జరుపుకుంటున్నాం. ఆ రోజు ఉత్తమ ఉపాధ్యాయుల్ని ఎంపిక



చేసి, సన్మానిస్తుంటారు" వివరించాడు మామయ్య.

"సర్వేపల్లి రాధాకృష్ణన్... ఆయన పేరు విన్నాం. కానీ ఆయన గురించేమీ తెలియదు" చెప్పాడు విశాల్.

"అయితే ఇలా వచ్చి కూర్చోండి. నాకు తెలిసిన వివరాలు చెప్తాను" అన్నాడు మామయ్య. రాజేష్ నోట్లో బ్రష్‌తో అలాగే కూర్చోబోయాడు. వాణ్ణి వారించి, ముందు ముఖం కడుక్కురమ్మని పంపాడు మామయ్య.

మరో రెండు నిముషాల్లో రాజేష్ వచ్చాడు. మామయ్య ఇలా చెప్పసాగాడు.

"అప్పట్లో ఆంధ్రప్రదేశ్ అని ప్రత్యేకంగా ఏమీలేదు. తమిళనాడు, ఆంధ్రప్రదేశ్ కలిసే ఉండేవి. ఆ రెండింటినీ కలిపి, ఉమ్మడి మదరాసు రాష్ట్రమని పిలిచేవారు. ఆ కాలంలో మద్రాసు దగ్గర్లోని తిరుత్తని గ్రామంలో 1880, సెప్టెంబర్ 5వ తేదీన సర్వేపల్లి రాధాకృష్ణ జన్మించారు. వీరస్వామి, సీతమ్మ ఆయన తల్లిదండ్రులు.

రాధాకృష్ణ చదువులో చురుగ్గా ఉండేవాడు. ఎంత కఠినమైన పాఠమైనా ఒక్కసారి వింటే చాలు. అతనికి ఇట్టే గుర్తుండిపోయేది. ఇతని తెలివితేటలు చూసి టీచర్లు కూడా ఆశ్చర్యపోయేవారు.

రాధాకృష్ణ తల్లిదండ్రులు చాలా పేదవాళ్లు. కానీ అతన్ని బాగా చదివించాలనుకునేవాళ్లు. కానీ వాళ్లకు డబ్బే అడ్డంకి" ఏదో గుర్తొచ్చినట్లు ఆగాడు మామయ్య.

"మరి రాధాకృష్ణ చదువుకోలేదా?" అమాయకంగా అడిగాడు రాజేష్.

"ఒరేయ్ మట్టిబుర్రా... చదువుకోకపోతే మాష్టారెలా అవుతార్రా..." రాజేష్ తల మీద చిన్న మొట్టికాయ వేస్తూ అన్నాడు విశాల్.

"మరి ఎలా చదివారు?" మళ్లీ అడిగాడు రాజేష్.

"స్కాలర్‌షిప్‌లతో. ప్రభుత్వం ప్రతిభ కలిగిన విద్యార్థులకు ధన సహాయం చేస్తుంది కదా. ఆ డబ్బుతో చదువుకున్నారు. 1908లో మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో అసిస్టెంట్ ప్రొఫెసర్‌గా చేరారు. ఆయన పాఠాలు చాలా చక్కగా చెప్పేవారట. ఆయన క్లాస్ కోసం విద్యార్థులు కాచుక్కూర్చునేవారట. ఆ తర్వాత ఏడాదికి ఆయన ప్రొఫెసర్ అయ్యారు. కొన్నాళ్లపాటు ఒకప్పటి రాజమహేంద్రవరం... అదేనర్రా... రాజమండ్రిలోని ఉపాధ్యాయుల శిక్షణా కళాశాలలో కూడా పనిచేశారు. కాశీ విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షునిగా కూడా పనిచేశారు.

రాధాకృష్ణ రచయిత కూడా. వేదాంతమున నీతిశాస్త్రము, రెయిన్ ఆఫ్ రెలిజియన్ ఇన్ కాన్‌టెంపరరీ ఫిలాసఫీ, భారతీయ జీవన దృక్పథము వంటి గ్రంథాలు రచించారు. రెయిన్ ఆఫ్ రెలిజియన్ ఇన్ కాన్‌టెంపరరీ ఫిలాసఫీ గ్రంథాన్ని బ్రిటన్, అమెరికాలోని విశ్వవిద్యాలయాలు తమ సిలబస్‌లో చేర్చాయి.

రాధాకృష్ణకు దైవభక్తి ఎక్కువ. అలాగే దేశభక్తి కూడా. 1942లో గాంధీగారు



తలపెట్టిన 'క్విట్ ఇండియా' ఉద్యమం దేశాన్ని ఒక ఊపు ఊపింది. ఆ సమయంలో ఎంతోమంది ప్రభుత్వ కొలువులు వదిలిపెట్టి, స్వాతంత్రోద్యమంలో పాల్గొన్నారు. వారిలో డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణ కూడా ఉన్నారు. రాజకీయాల్లోకి వచ్చిన తర్వాత రాజ్యాంగ నిర్మాణంలో ప్రముఖపాత్ర పోషించారు.

భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత మూడేళ్లకుగానీ మన రాజ్యాంగం సిద్ధంకాలేదు. మన తొలి రాష్ట్రపతి బాబూ రాజేంద్ర ప్రసాద్. తొలి ఉపరాష్ట్రపతి... డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణ. బాబూ రాజేంద్ర ప్రసాద్ తర్వాత ఆయనే రాష్ట్రపతి అయ్యారు.

పిల్లలిద్దరూ ఏదో మాట్లాడబోయేంతలో.... "ఏరా... ట్యూషన్ ఎలాగూ లేదు. స్కూల్‌కి కూడా డుమ్మా కొడ్దామనుకుంటున్నారా? త్వరగా రండి. టైమవుతోంది'' అంటూ అమ్మ కేక వినిపించింది. అంతే... ఇద్దరూ మామయ్యకు 'థాంక్స్' చెప్పి ఎవరింట్లోకి వాళ్లు తుర్రుమన్నారు.

# అక్షరాలు నేర్చుకుందాం

**-సూరంపూడి విశ్వం**



అక్షరాలు నేర్చుకుందాం!
లక్షణంగా చదువుకుందాం! ॥ అక్షరాలు ॥

పలక బలపం పట్టుకుని
పడవ కడవ రాద్దాము
పరువూ పరపతి పెంచుకుని
పగలే వెన్నెల చూద్దాము ॥ అక్షరాలు ॥

"అంబా" అని అరిచే పశువుకి.
"అమ్మా" అని పిలిచే మనిషికి
పిలుపు అక్షరమే కదా
అని తెలుసుకుందాం!
అక్షరాల విలువ తెలిసి మసలుకుందాం । ।
అక్షరాలు ॥

అక్షర జ్ఞానమెరుగని బోయివాడు
మహాకవి వాల్మీకి కాలేదా?
అక్షరమంటే తెలియని కాళిదాసు
మహాకవిగ మారలేదా?
ప్రతిమను గురువుగ పూజించి
ఏకలవ్యుడు మేటి విలుకాడు కాలేదా?
ఇవి కట్టు కథలు కావని
పట్టుదలతో సాధ్యమని తెలుసుకుందాం!
పట్టుదలతో పని చేద్దాం !
ప్రగతిపథంలో పయనిద్దాం ॥ అక్షరాలు ॥



# మంచిమాట



బాలలూ ప్రతి విషయాన్నీ లోతుగా పరిశీలించండి. పైపైన మాత్రమే చూసి నిర్ణయాలు తీసుకోవద్దు. మంచు కొండ (గ్లేసియర్)లో మనకు పైన కనిపించే భాగం 10 శాతం మాత్రమే. మిగతా 90 శాతం సముద్ర భాగంలోనే వుంటుంది. అందువల్ల ఏ విషయాన్నైనా మూలానికి వెళ్ళి పరిశీలించండి.

మొహంలో నవ్వు సంతరించు కొండి. నవ్వుతూ పలకరిస్తే అందరూ స్నేహితులౌతారు.

ఏ భాషలోనైనా తమ పేరును మించిన తియ్యటి పదం వుండదట! అందుకే మీ మిత్రుల్ని పేరు పెట్టి పిలువటం మరచిపోకండి. అందరిపేర్లూ గుర్తు పెట్టుకోండి.

మీకిష్టమైన పని, అంటే ఏ పని చేస్తూ వుంటే మీరు ఆనందపడతారో, పరిశీలించండి. అది ఆటైనా కావచ్చు, సంగీతం కావచ్చు, లేదా పుస్తకాలు చదవటం కావచ్చు. దేనిలో అయినా కృషి చేస్తూ వస్తే పెద్దవారయ్యాక అందులో ప్రసిద్ధులవుతారు.

పెద్దలమాట, ఉపాధ్యాయుల మాట వినండి. వారు చెప్పినట్టు క్రమశిక్షణ పాటించండి.

**జంధ్యాల శ్రీకరుణ**



# తా...రా...న...గ...

పుష్పాల కృష్ణమూర్తి

ఆనందకేతుని ఆస్థాన నర్తకి తారమణి, సొగసైన నాట్యకత్తె. రాజు తన పుట్టిన రోజున ఆమె నాట్యాన్ని ఏర్పాటు చేశాడు. వేలాది ప్రజలు హాజరైనారు. సతీసమేతంగా ఆమె నృత్యాన్ని చూసిన రాజు పరవశుడై పోయాడు. ఆనందంతో నవరత్నాలు పొదిగిన తన మెడలోని హారాన్ని ఆమెకు బహూకరించాడు. అప్పటి వరకూ నృత్యాన్ని చూసి మెచ్చుకున్న మంగవ్వకు నగను చూడగానే ఎక్కడలేని ఈర్ష్య కలిగింది.

"ఏవండీ! ఆ నగను చూశారా! ఎంత బావుందో? దాన్ని ధరించి ఒక్కరోజు జీవించినా చాలండి. జన్మ ధన్యమైపోతుంది" అన్నది భర్త గట్టయ్యతో, తన్మయత్వంతో నగను చూస్తూ...

"ఆమె గొప్ప నర్తకి, తగినట్లుగానే సత్కరించాడు" అన్నాడు గట్టయ్య ఇంటికి బయలుదేరుతూ.

"నాకూ అలాంటిదే నగ చేయించండి. ఈ జన్మకిక మిమ్మల్నేం కోరను" అన్నది ప్రాధేయపూర్వకంగా.

"నేనో సామాన్యరైతును. నా దగ్గర అంత డబ్బు ఎక్కడిదే? దొంగతనం తప్ప మరో మార్గం కనబడ్డంలేదు" అన్నాడు సాలోచనగా.

"ఏమోనండి. మీరు ఏదో ఒకటి చేయండి. ఆ నగ నా మెళ్ళో పడితేనే, అన్నం



ముట్టేది. అప్పటి వరకూ నేనే పనీ చేయను" అని భీష్మించుకుని మంచమెక్కింది.

గట్టయ్య గొంతులో వచ్చి వెలక్కాయ పడ్డట్లయింది. "యిదెక్కడి పీడరా నాయనా, రానన్నా, బలవంతంగా నృత్యానికి తీసుకు రావడం ఎంత పొరపాటైంది అనుకుని ఎలాగైనా అలాంటి నగను, ఆరు నెలల్లో తెచ్చి, నీ కిస్తా. అప్పటి వరకూ నీ ప్రతిజ్ఞ వాయిదా వేసుకో'' అని ప్రాధేయపడ్డాడు.

కాన్త మెత్తబడి, 'యిప్పటి కిప్పుడంటే ఎలా తేగలడు? కాస్తా సమయమిచ్చి చూద్దాం అనుకుని సరేనంది.



భర్త నగ విషయం మరిచిపోకుండా పనికి పోయేటప్పుడు, అన్నం తినేటప్పుడు, పడుకునే టప్పుడూ యిలా రోజులో ఏదో ఒక సమయంలో గుర్తు చేయసాగింది.

భార్యపోరు పడలేక, ఆ నగను తారామతి నుంచి దొంగిలిద్దామనే నిర్ణయించుకున్నాడు. ఇంటి మీద నిఘా వేసి, ఆమె కదలికల్ని గమనించసాగాడు. భార్య గుర్తు చేసినప్పుడల్లా ఏదో ఒక వంక చెప్పసాగాడు.

ఒకనాడు తారామతి తల్లికి అనారోగ్యంగా వుందని కబురు రావడంతో హడావిడిగా పొరుగు రాజ్యానికి బయలుదేరింది.

అదను కోసం చూస్తున్న గట్టయ్య కాపలా భటుల కళ్ళుగప్పి, తారామతి మేడలో జొరబడ్డాడు. యిల్లంతా శోధించి హారాన్ని చేజిక్కించుకున్నాడు. నేరుగా యింటికి వచ్చి భార్యకు కానుకగా యిచ్చాడు.

వారం తర్వాత తల్లితో యిల్లు చేరిన నర్తకి, ఇంటి పరిస్థితి చూసి లబోదిబో అంది. వెంటనే రాజు వద్దకు పరుగెత్తుకు వెళ్ళి తన యింట్లో దొంగలు పడి, రత్నాల హారం దొంగిలించినారని ఫిర్యాదు చేసింది.

కాపలా భటులను విచారించి వారు నిర్దోషులని నిర్ధారించుకున్నాడు రాజు. గూఢాచారులను నియమించాడు. పాత దొంగల్ని విచారించినా ఫలితం లేకపోయింది. తారామతి దిగులుతో గజ్జె కట్టడం మానేసింది.

రాజు నగ తెచ్చినా, లేదా దొంగ ఆచూకీ చెప్పినా లక్ష వరహాలిస్తానని ప్రకటించాడు.

అన్నాలు తినగానే హారాన్ని మెళ్ళో వేసుకుని మురిసిపోతూ, తెల్లవారి లేవగానే పెట్టెలో పెట్టి భద్రం చేయసాగింది మంగవ్వ. కొద్ది కాలం గడిచిపోయి, శీతాకాలం వచ్చింది.

హరిదాను రామకృష్ణ చాలా బీదవాడు. నలుగురు ఆడపిల్లలు కూడా. భాగవతాలు వేస్తూ, సంక్రాంతి రోజుల్లో హరికీర్తనలు పాడుకుంటూ హరిదాసు వేషంలో ప్రజల్ని అడుక్కుంటూ సంసారాన్ని బాగు చేసుకొస్తున్నాడు.

మెడలో పూలదండతో, చేతిలో చిడతలు వాయిస్తూ, కాళ్ళకున్న గజ్జెలతో నృత్యం చేస్తూ, భుజాన ఉన్న తంబురను మీటుకుంటూ బయలుదేరాడు. "హరిలో రంగహరి" అని పాడుకుంటూ యిల్లిల్లూ అడుక్కోసాగాడు. కావమ్మ బిక్షవేసి ఆ



గట్టయ్యింటికి వెళ్ళకు. మహా పిసినారి. పిల్లికి భిక్షం వేసి ఎరగడు. మరో యింటికి వెళ్ళు' అంది.

'అంతా భగవదేచ్ఛ' అనుకుంటూ గట్టయ్య యింటి ముందుకు వెళ్ళాడు. చక్కని కీర్తన పాడితేనన్నా యింత బిక్షవేయదా అనుకుంటూ, తంబురాను శృతి చేసుకోసాగాడు. "తా...రా...నా...నా... గ...గా..." అంటూ రాగం సరిచేసుకో సాగాడు. తంబూరను మీటుతూ.



ఆ మాట విన్న మంగవ్వ ఉలిక్కిపడింది.

'తారా నగ' అంటున్నాడు. యింట్లో తారామతి నగ ఉన్నట్లు ఈ హరిదాసుకు తెలిసిపోయినట్లుందే! అసలే హరిదాసులకు మాయలు, మంత్రాలు వస్తాయంటారు. మా గుట్టంతా విప్పుతాడేమో?' అనుకుంటూ, నిద్రపోతున్న భర్తను ఒక్క దెబ్బ వేసి లేపింది.

ఉలిక్కిపడి లేచాడు. దొంగతనం చేసినప్పట్నుంచే భయంతో యింట్లోనే ఉండసాగాడు. బైటకెళితే భటులు పట్టుకుని ప్రశ్నిస్తారనే భయం పట్టుకుంది.

'ఏమైందీ? మన యింటికి రాజభటులు చుట్టుముట్టలేదుగదా?" అన్నాడు గాబరాగా.

'అలాంటిదే ఆ హరిదాసు ఇంటి ముందు నిలబడి తారా నగ అంటున్నాడండి. మీరు తారామతి నగ దొంగిలించిన సంగతి తెలిసిపోయినట్లుంది'' అంది గుసగుసలాడుతూ.

''అమ్మో! రాజుకు తెలిస్తే పాతరేస్తాడు! ఎవరూ వినకముందే పంపించేయి మరి" అన్నాడు తొందర పెడుతూ.

వెంటనే చేటలో మానెడు బియ్యం పోసుకుని వెళ్ళి, నెత్తిమీదున్న కలశంలో గుమ్మరించి యింక దయచేయండి.. దయచేయండి' అని తొందర చేసింది.

"కీర్తన ఒకటి వినిపించి గాని వెళ్ళను'' అని తా...రా...న...గ...గ్గా... అంటూ తంబురను శృతి చేసుకోసాగాడు.

"వాడు వెళ్ళేలా లేడండి. మనం చేసిన పనంతా కీర్తనలో వినిపిస్తాడట'' అంది తత్తరపడుతూ.

"వాడ్ని ఎలాగైనా తొందరగా వెళ్ళగొట్టవే. నాకు ముచ్చెమటలు పోస్తున్నాయి" అన్నాడు గుటకలు మింగుతూ.

యింట్లోకెళ్ళి గబాల్న పది వరహాలు అందుకుని తీసుకెళ్ళి హరిదాసు చేతిలో పెట్టి "ఇకనైనా వెళ్ళండి?" అంది దీనంగా.

''అమ్మమ్మా! ఎంత మాట. యివ్వాళ్ళ మీకు కీర్తన వినిపించాలె. నేను వెళ్ళాలె" అన్నాడు హరిదాసు. వీరి మాటలు విన్న చుట్టు పక్కల యిండ్లవాళ్ళంతా వెలుపలకు వచ్చి వింతగా చూడసాగారు.

"అమ్మో! వీడు వెళ్ళడు. వీడికి మన సంగతి తెలిసిపోయింది" అని ఇరవై వరహాలు తెచ్చి దాసు చేతిలో పెట్టి "ఇంకనైనా వెళతారా" అన్నాడు కటువుగా.

"అప్పుడే ఎలా వెళతాను? ఓ కీర్తన



పాడి వినిపిస్తా. ఆ కీర్తనలో జరిగిన భారతం వినిపిస్తా తా...రా...న...గ... అన్నాడు మహాభారం ఇతివృత్తం కలిగిన కీర్తనను గుర్తు తెచ్చుకుంటూ.

గట్టయ్య కోపం కట్టలు తెంచుకుంది. ఏందయ్యా, ఇందాకట్నుంచి తెగ 'తారనగ' అంటున్నావు. అవును నేనే తీసిన. ఆ తైతక్కలాడికి మొయ్యలేనన్ని నగలున్నాయి. మా ఆవిడకు ఒక్క నగ ఉంటే తప్పా. కావాలని ముచ్చట పడితే తెచ్చిన. తారామతికి కోరికలున్నట్లే మా ఆవిడకుండవా?...పో... చెప్పుకోపో " అన్నాడు కఱ్ఱ తీసుకుని మీదికి వస్తూ...

హరిదాసుకు అంతా అర్థమైంది. అందుకే యింత దానం చేశారా? అనుకూంటూ నేరుగా పరిగెత్తి రాజు ముందు వాలాడు.

ఇంకేముంది, భటులొచ్చి ఇల్లంతా శోధించి నగను స్వాధీనం చేసుకున్నారు. నగను దొంగిలించినందుకు గట్టయ్యకు, గొంతెమ్మకోర్కె కోరినందుకు మంగవ్వకు జైలు శిక్ష విధించాడు.

అనుకోకుండానైనా దొంగను పట్టిచ్చినందుకు హరిదానుకు లక్ష వరహాలిచ్చాడు ఆనందకేతుడు.

ఈర్ష్య, మితిమీరిన స్వార్థం ఎలాంటి దుష్ఫలితాలకు దారి తీస్తుందో గమనించారా బాలలు!!

# మా బాల్యాన్ని చంపకండి...

**-కూసుపూడి లక్ష్మణ్‌రావు**



**పల్లవి:**

పిల్లలం, మేం పిల్లలం, పిల్లలం
మేం పిడుగులం, ఉరుములం, మీసిరులం
మాకేమి తెలియదని అంటారుగానీ
అవకాశం మీరిస్తే ఆకాశం చుట్టేస్తాం
॥ పిల్లలం ॥

చదువుతోపాటు మాకు ఆటాపాటా కావాలి
ఆటా పాటాతోపాటు అల్లరి జత కావాలి
అప్పుడే ఉత్సాహం అమ్మలూ
అక్కడే ఆనందం నాన్నలూ ॥ పిల్లలం ॥

ఇంటి పనులు వంట పనులు ఏమైనా గానీ
చిటికెలోన చేసిపెట్టి చదువుకుంటాగానీ
చదువు ఆపమనడం మీకు న్యాయమా?
కూలిపనికి పంపడం ధర్మమా॥ పిల్లలం ॥

బాల్యానికి విలువనిచ్చి మా భవిత మీరు దిద్దండి
స్వార్థానికి విలువనిచ్చి మా బాల్యాన్ని చంపకండి
తిరిగిరాని మా బాల్యమంటే చులకనా?
మనసుతోన చూడకుంటే న్యాయమా?
॥ పిల్లలం ॥



జాతర జరిగే చోటు
గద్దె వద్ద జనసందోహం

# సమ్మక్క - సారక్కల మేడారం జాతర

బాలలూ! మేడారం జాతర గురించి మీరు వినే ఉంటారు కదూ! దీనినే సమ్మక్క-సారక్క జాతర అని కూడా పిలుస్తారు. రెండు సంవత్సరాలకు ఒకసారి ఈ జాతర జరుగుతుంది. వరంగల్ జిల్లా కేంద్రం నుండి సుమారు 150 కి.మీ. దూరంలో ఉన్న ములుగు తాలూకలోని మేడారం గ్రామంలో ప్రతీ రెండు సంవత్సరాలకు ఒకసారి ఫిబ్రవరి నెలలో మాఘశుద్ధ పౌర్ణమినాడు ఈ జాతర ప్రారంభమవుతుంది.. ఈ గ్రామ జనాభా మూడు వందలకు మించరు. అయితే జాతర జరుగుతున్నప్పుడు ఈ గ్రామానికి సుమారు 60 లక్షల మంది వస్తారని అంచనా. అంటే మన రాజధాని హైదరాబాద్ జనాభా అంత అన్నమాట. ఇంత పెద్ద జాతర వెనుక గొప్ప సాహస కథ ఉంది. సుమారు ఎనిమిది వందల సంవత్సరాల నాటి కథ. ఈ ప్రాంతంలోని బయ్యక్క పేటకు చెందిన కోయదొరలు ఒక రోజు అడవిలోకి .వేటకు వెళ్ళారు. ఆ దట్టమైన అడవిలో పెద్ద పులుల మధ్య దేదీప్యమానంగా ప్రకాశిస్తూ ఒక పసిపాప కనిపించింది. ఆ దృశ్యాన్ని చూసిన కోయదొరలు గూడెం పెద్దలకు తెలిపి ఆ పసిపాపను పల్లకిలో ఎత్తుకొని మేళతాళాలతో వారి గ్రామానికి తీసుకుపోయారు. ఆ పసిపాప గ్రామానికి వచ్చినప్పటి నుండి కోయప్రజలకు అన్నీ శుభాలే. వాటిని చూసిన కోయదొరలు సాక్షాత్తూ కొండ దేవతే పాప రూపంలో సాక్షాత్కరించిందని భావించారు. శుభప్రదమైన మాఘ శుద్ధ పౌర్ణమి రోజున ఆ పసి పాపకు "సమ్మక్క" అని పేరు పెట్టారు.

సమ్మక్క యుక్త వయస్సుకు రావటంతో మేడారం గ్రామాన్ని పాలిస్తున్న పగిడిద్దరాజుకు ఇచ్చి వివాహం చేసారు. ఆ దంపతులకు కూతురు సారలమ్మ,



కొడుకు జంపన్నలు జన్మించారు. అప్పుడు కాకతీయ సామ్రాజ్యాన్ని ప్రతాపరుద్రుడు పాలిస్తుండేవాడు. మేడారం ప్రాంతంలోని కోయరాజులు కాకతీయులకు సామంతులుగా వుండేవారు. ఆ కాలంలో వరుసగా నాలుగు సంవత్సరాలు అనావృష్టి ఏర్పడి పంటలు పండక కరువు విలయతాండవం చేసింది. ప్రజలు పన్నులు చెల్లించలేని స్థితికి చేరారు. దీనితో పగిడిద్దరాజు కాకతీయులకు కప్పం చెల్లించడానికి నిరాకరించాడు. కోపం వచ్చిన చక్రవర్తి ప్రతాపరుద్రుడు గిరిజన రాజు పగిడిద్దరాజు మీద యుద్ధానికి సైన్యాన్ని పంపాడు.

కాకతీయుల సైన్యంతో జరిగిన యుద్ధంలో పగిడిద్దరాజుతో పాటు, అతని కుమార్తె సారలమ్మ అల్లుడు గోవిందరాజులు మరణించారు. పగిడిద్దరాజు కుమారుడు జంపన్న పరాజయాన్ని జీర్ణించుకోలేక గ్రామం ప్రక్కనేగల సంపెంగ వాగులో దూకి ఆత్మహత్య చేసుకున్నాడు. అప్పటి నుండి సంపెంగ వాగుని జంపన్న వాగుగా పిలుస్తారు. ఈ సమయంలో సమ్మక్క స్వయంగా కాకతీయ సేనలతో యుద్ధం చేసింది. అపరకాళిగా విజృంభించి కాకతీయ సైన్యాలను చీల్చి చెండాడింది. ఎక్కడచూసినా చంఢీలా వీరవిహారం చేస్తున్న సమ్మక్కని చూసి ఓటమి తప్పదని భావించిన


భక్తుల నృత్యాలు


జంపన్న వాగులో భక్తుల స్నానం

కాకతీయ సైనికుడొకడు దొంగచాటుగా వెనక నుంచి బల్లెంతో ఆమెని పొడిచాడు. యుద్ధంలో గాయపడిన సమ్మక్క మేడారానికి ఈశాన్య దిక్కున గల చిలకలగుట్ట వైపు అడవిలోకి వెళ్ళిపోయింది. ఆ తరువాత కోయదొరలు అడవిలోకి వెళ్ళి వెతకగా, చిలకలగుట్ట మీదనున్న నాగవృక్షం సమీపంలో పుట్టవద్ద పసుపు కుంకుమ గల కుంకుమ భరణి వారికి లభించింది. తమ సమ్మక్కయే కుంకుమ భరణి రూపంలో లభించిందని కోయదొరలు భావించారు.

అప్పటి నుండి ప్రతీ రెండు సంవత్సరాలకు ఒకసారి ఫిబ్రవరి నెలలోమాఘశుద్ధ పౌర్ణమి నాడు ప్రతీ రెండు సంవత్సరాలకు మేడారం గ్రామానికి మూడు కి.మీ. దూరంలో గల భరణి లభించిన చోట పండుగ జరుపుకొనేవారు. క్రమంగా ఈ పండుగకు వచ్చే వారి సంఖ్య పెరగడంతో మేడారం గ్రామంలో గద్దెలను నిర్మించారు. అక్కడ దేవత కుంకుమ భరణి పెట్టడంతో జాతర ప్రారంభమవుతుంది. మూడు రోజులు జరిగే ఈ జాతరకు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రజలతో పాటు మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, చత్తీస్‌గడ్, ఒరిస్సా రాష్ట్రాల నుండి కూడా పెద్దయెత్తున ప్రజలు వస్తారు. పసుపు కుంకుమలతో పాటు బెల్లంను దేవతకు నైవేద్యంగా సమర్పిస్తారు.





# తెలివి ఒక్కటే సరిపోదు

-శాఖమూరి శ్రీనివాస్

సుధీరుడు విద్యాభ్యాసాన్ని పూర్తి చేసుకున్నాక ఉద్యోగ ప్రయత్నాలు మొదలు పెట్టాడు. ఎక్కడ ఉద్యోగ ఖాళీలు ఉన్నాయని తెలిస్తే అక్కడికెళ్ళేవాడు. మంచి తెలివితేటలు ఉండడంవల్ల అడిగిన ప్రశ్నలకు చక్కగా సమాధానాలిచ్చేవాడు. సుధీరుని జవాబులకు యజమానులు ఎంతో సంతోషించేవారు.

అయితే... అతని ప్రతిభను ఎంత మెచ్చుకున్నా ఉద్యోగం మాత్రం ఇచ్చేవారు కాదు. ఇంకోసారి ఖాళీలు ఏర్పడ్డప్పుడు ప్రయత్నించమని తిప్పి పంపేవారు. సుధీరుడికి ఏమీ అర్థం అయ్యేదికాదు. వాస్తవానికి... వెళ్ళిన ప్రతి చోటా సుధీరుణ్ణి మించిన ప్రతిభావంతులు హాజరు కాలేదు. కానీ, విచిత్రంగా సుధీరునికి కాక... మిగతా వారిలో ఒకరు ఉద్యోగం పొందడం జరుగుతోంది.

లోపం ఎక్కడుందో అర్థం కాలేదు. ఈ విధంగా చాలా ఉద్యోగ ప్రయత్నాలు చేశాక ఎంతో విసుగు కలిగింది అతనికి. ఒక రోజు దిగులుగా కూర్చుని ఉండగా... దారిన పోతున్న విమలుడు చూశాడు. దగ్గరకు వచ్చి, "ఏం మిత్రమా... కొద్ది రోజుల నుంచి నిన్ను గమనిస్తున్నాను. నీ విచారానికి కారణం తెలుసుకోవచ్చా?" అని అడిగాడు.

సుధీరుడు తన విచారానికి కారణం చెప్పాడు. విమలుడు కాసేపు ఆలోచించి, "ఈసారి నువ్వు ఉద్యోగ ప్రయత్నానికి వెళ్ళేటప్పుడు నాకు కబురు చెయ్యగలవా?" అన్నాడు.

"ఓ.... అలాగే! తప్పకుండా..." అని అనడమేగాక, ఓ రోజు కబురు పెట్టాడు సుధీరుడు. విమలుడు వచ్చి, "బయలుదేరుతున్నావా?" అన్నాడు.

''అవును, ఏం?'' సుధీరుడి సమాధానం.

''మరి ఈ రకమైన దుస్తులేసుకున్నావేంటి? ప్రతిసారీ ఇలాంటి వాటినే ధరించి వెళతావా?... చూడు. మాసిపోయి - అక్కడక్కడ రంధ్రాలతో ఎంత ఎబ్బెట్టుగా ఉన్నాయో?" అన్నాడు విమలుడు.



"అవును... అయినా ఉద్యోగానికి కావలసింది తెలివితేటలేగాని, దుస్తులతో పనేంటి? నీ ప్రశ్న విడ్డూరంగా ఉంది." తన తెలివి తేటలపై అపార నమ్మకంతో అన్నాడు సుధీరుడు.

"నువ్వు చెప్పింది నిజమే... కానీ, తమ ఉద్యోగులు తెలివితోపాటు చక్కగా ఉండాలని యజమానులు కోరుకుంటారు. నేను ఊహించింది వాస్తవమైతే. ఈ దుస్తులు మార్చితే నీకు విజయం లభించవచ్చు."

విమలుడి మాటలు జాగ్రత్తగా విన్న సుధీరుడు తనకున్న వాటిలో మంచి దుస్తుల్ని ధరించి వెళ్ళాడు. ఆశ్చర్యంగా సుధీరుడికే ఆ ఉద్యోగం లభించింది. చిన్నలోపాన్ని సవరించి తనకెంతో మేలు చేసిన విమలుడ్ని సుధీరుడు ఎన్నడూ మరువలేదు.

మరి చూశారా బాలలూ! అనుకొన్నది సాధించడానికి తెలివి ఒక్కటే సరిపోదని, అనుకొన్నదానికి అవసరమైన భౌతిక ఏర్పాట్లు కూడా అవసరమని.

---

# చదువుకోవడం మా జన్మహక్కు

-జి. సుధాకరరెడ్డి



బాలలం భావిభారత పౌరులం
భారత భవితకు పునాదులం

తూనీగల్లా ఎగిరే పిల్లలం
తువ్వాయిలా దుమికే బాలలం
కోయిల గొంతున పాటలం
చిలుకనోటిలో పలుకులం ॥ బాలలం ॥

పలకుంటే బలపం లేని వాళ్లం
బువ్వుంటే బట్టకు కాని వాళ్లం
పేదరికపు పందిరికింద బజ్జుకున్న వాళ్లం
అభ్యసన సామర్థ్యాల వెనుకబడిన వాళ్లం
॥ బాలలం ॥

పాలు తాగినట్టూ, కేరింతలు కొట్టినట్టూ
ఆడుకున్నట్టూ అలసి నిద్రించినట్టూ
ఉషోదయాన సూరీడల్లే మేల్కొన్నట్టూ
అంటూన్నాం "చదువుకోవడం మా జన్మ హక్కంటూ" ॥ బాలలం ॥

నినదిస్తున్నాం "అక్షరభారతి" మాకేనంటూ
నిలదీస్తున్నాం "అందరికీ విద్య" దక్కాలంటూ
అభ్యర్థిస్తున్నాం "బాల కార్మిక విమోచన" కావాలంటూ
ఆనందిస్తున్నాం "విద్య గుణాత్మకమై" వెలిగిందంటూ ॥ బాలలం ॥

# బొమ్మల ప్రపంచం



రంగులు వేద్దామా?



బోటు
దగ్గరికి
ఎలుక
ఏ
దారిలో
వెళ్తుంది?





వి. చకిత
4వ తరగతి
సెంట్ ఆడమ్స్ హైస్కూల్
చిక్కడపల్లి, హైదరాబాద్



# అమ్మమ్మ మాట




డి. సుజాతా దేవి

అమ్మమ్మ : రాజూ రంగా గీతా నీతా సునీతా
మేరీ జానీ బాచి ఆశ ఆయేషా
క్లాసులోకి మీరొస్తారా
కథ చెబుతాను వింటారా.
పిల్లలు : ఏమిటా కథ అమ్మమ్మా
అమ్మమ్మ : కాదు కాదు కథ కానే కాదు
పిల్లలు : తెలుసు నాకు తెలుసు నక్క
పిల్లి, ఎలుక, చిలుక
అమ్మమ్మ : రాజు రాణి మనకొద్దు.
రాముడు, కృష్ణుడు రాలేరు.
ఎలుకను పిల్లిని పట్టుకొని
టీవిలోనే కట్టిపడేసారు.
పిల్లలు : అయితే ఏంటో చెప్పండి
అమ్మమ్మ : ఆడేపాడే బాలల్లారా! అందచందాల పూవుల్లారా!
అక్షరాలను నేరిస్తే చాలదు.
వాటిని కూర్చడమూ తెలియాలి.
సొంతంగా కూర్చాలి.
పిల్లలు : ఓ ! రాసేస్తాం, చూసుకో సొంతగా రాసేస్తాం చూసుకో.
అమ్మమ్మ : అక్షరాలు నేరిస్తే చాలదు బుజ్జాయి.
అందంగా ఒక వాక్యం రాయి చిన్నారి.
పిల్లలూ : ఇవిగివిగో అక్షరాలు



వస్తున్నాయ్ వరుసగా
అటూ ఇటూ కలిపితే
అతుక్కున్నాయ్ మాటలుగా
అమ్మా నాన్నా అన్నయ్య
ఎలుక, చిలుక, చింపాంజి
కుక్కా నక్క పెద్దపులి
చాలు చాలు ఇక చాలు
బాగా మీరు రాయాలంటే
భాషా భాగాలు తెలియాలి

పిల్లలు : భాషా భాగాలవి ఏవి?
ఎక్కడున్నాయి? ఎలాటివి?

అమ్మమ్మ : భాషా భాగాలు ఐదుంటాయి
బాలల్లారా వినరండి.
రాజు రాణి సీత గీత భూమి స్వామి
పేర్లను పలికే పదాలు అన్నీ
నామవాచకాలు

పిల్లలు : పేర్లను పలికే పదాలు అన్నీ నామవాచకాలు!!

అమ్మమ్మ : అతడు, ఆమె, వారూ, మీరు, నువ్వు, నేను, అదియు, ఇదియు పేర్లకు బదులుగా వాడే మాటలు సర్వనామాలు. తెలిసిందా?

పిల్లలు : పేర్లకు బదులు పలికే పదాలు సర్వనామాలని తెలిసింది. వచ్చెను, తెచ్చెను, కట్టెను, కొట్టెను, కోసెను, రాసెను పనులను తెలిపే పదాలు అన్నీ క్రియా పదాలని తెలిసిందా?

పిల్లలు : పనులను తెలిపే పదాలన్నీ క్రియా పదాలని తెలిసింది.

అమ్మమ్మ : తెల్లటి మల్లెలు, ఎర్రగులాబి, పచ్చని తోట, తియ్యని భాషలలో గుణాన్ని తెలిపే మొదటి పదాలు అన్నీ 'విశేషణాల'ని గుర్తించండి.

పల్లలు : గుణాలు తెలిపే పదాలు విశేషణాలు, విశేషణాలు.

అమ్మమ్మ : ఆహా, ఓహో, అక్కడ, ఇక్కడ
అయ్యో, భళీ, భళీ, బాగుబాగు
లింగవచనాలు లేనివి అన్నీ
'అవ్యయాలు' అని అంటాము.

పిల్లలు : భాషా భాగాలు నేరుస్తాం
భలే భలేగా రాసేస్తాం
పరీక్ష బాగా రాసేస్తాం
కథలూ, పాటలూ కల్పిస్తాం.

# ఏమి నేర్చుకొన్నారు?



-కాకర్లమూడి విజయ్

హలో చిన్నారులూ. బావున్నారా? నేనో చిన్న కథ చెబుతానర్రా. అది చదివి, దాని నుండి మీరేం నేర్చుకుంటే బావుంటుందో చెప్పాలి సరేనా?

ఒక ఊళ్ళో ఒక గురువు పిల్లల కోసం ఒక పాఠశాల స్థాపించాడు. అక్కడికి చుట్టుపక్కలకు ఊళ్ళ నుండి పిల్లలు వచ్చి, గురువు ఆశ్రమంలోనే ఉండి విద్యను అభ్యసించేవాళ్ళు.

ఒకనాడు ఆ పాఠశాలలో మరో ఇద్దరు పిల్లలు చేరారు. వాళ్ళిద్దరూ తెలివిగల వాళ్ళే. కానీ దేనిపైనా ఎక్కువసేపు ధ్యాస ఉంచేవాళ్ళు కాదు. ఒక పాఠం మొదలవ్వగానే అది పూర్తవ్వకుండానే మరో పాఠం



మొదలెట్టేవాళ్ళు. దీనివల్ల మిగతా పిల్లలు ఇబ్బంది పడతారని గురువు వాళ్ళని వేరేగా కూర్చోబెట్టి పాఠాలు నేర్పేవాడు.

ఎన్నిరోజులైనా, ఎన్ని రకాలుగా చెప్పి చూసినా వాళ్ళిద్దరూ ఏ మాత్రం మారలేదు. దాంతో గురువు ఒక పథకం వేశాడు.

ఒక రోజు గురువు ఆ ఇద్దరు పిల్లల్నీ పిలిచి ఎండా కాలం రాబోతోంది. అప్పుడు మన ఆశ్రమంలో నీటి ఎద్దడి ఏర్పడుతుంది. అందుకని మనం మరో బావి తవ్వాలి. ఆ పనిని మీరు చేయాలి. మీరు ప్రారంభించిన తరువాత నేను ఊరి నుండి పని వాళ్ళని రప్పిస్తాను. సరేనా?'' అని అడిగాడు.



తమకి పెద్ద బాధ్యత అప్పగిస్తున్నాడనుకొని పిల్లలు సరే అన్నారు.

గురువు వాళ్ళకు పలుగులు, పారలు ఇచ్చి ఎక్కడ తవ్వాలో చూపించాడు. పిల్లలిద్దరూ ఆనందంగా తవ్వడం ప్రారంభించారు. కొంతసేపటికి గురువు అక్కడికి వెళ్ళి, "ఆగండాగండి. ఇక్కడొద్దు. అదిగో అక్కడ తవ్వండి" అంటూ మరో చోటు చూపించాడు. అపుడు పిల్లలు గురువు చూపించిన మరో ప్రదేశంలో తవ్వడం ప్రారంభించారు. కొద్దిసేపటి తరువాత మళ్ళీ గురువు వచ్చి "ఇక్కడ నీళ్ళు పడేటట్టులేదు. మరో చోట తవ్వుదాం. ఆ చెట్టు దగ్గర ప్రయత్నించండి" అని చెప్పాడు.

పిల్లలు విసుగుతో కొత్త చోట తవ్వడం మొదలెట్టారు. మళ్ళీ కొద్ది సేపైన తరువాత గురువు వచ్చి మరో చోట తవ్వమన్నాడు. ఇలా ఇంకో రెండు మూరు సార్లు స్థలం మార్చేటప్పటికి పిల్లలకి కోపం వచ్చింది.

"ఏంటి గురువుగారూ ఎందుకిలా ప్రతిసారీ కొత్త స్థలం చూపిస్తున్నారు? మొదట తవ్విన దగ్గరే తవ్వుతుంటే ఈపాటికి బావి పూర్తయి నీళ్ళు కూడా వచ్చేవి కదా?"

"అరె, అలా అంటారేమిటి? మీరు చేస్తున్న పనే నేను చేశాను. మీరు కూడా ఒక పాఠం పూర్తవకుండా మరో పాఠం కావాలంటున్నారు కదా. అలా చేస్తే మీకు ఏ పాఠమూ పూర్తిగా రాదు. ఒకే పాఠం పూర్తయ్యే వరకూ చదివితే బాగా వస్తుంది" అన్నాడు గురువు.

తమకు బుద్ధి రావాలనే బావి తవ్వే నాటకం ఆడాడు గురువు అని పిల్లలు గ్రహించారు. తమ పద్ధతి మార్చుకుని మంచి విద్యార్థులై ప్రవర్తించసాగారు. అదరా! పిల్లలూ కథ. బావుంది కదూ? మరి ఇందులో నుండి మీరు నేర్చుకోవలసిన విషయం ఏమిటి? మాకు రాయండి సరేనా?



# గురుశిష్యులు

- క్రాంతి

"రామూ! నాలుగు రోజులున్నుండి బడికి రావట్లేదేంటి?" బజార్లో ఎదురైన విద్యార్థిని అడిగారు గంగిరెడ్డి మాష్టారు.

"మా నాన్న వద్దన్నాడండీ...." తల దించుకొని మెల్లగా చెప్పాడు రాము.

"ఎందుకని?" మళ్లీ అడిగారు మాష్టారు.

"డబ్బుల్లేవంట..." కన్నీళ్లనాపు కుంటూ చెప్పాడు రాము.

"సరే... సాయంత్రం పొలం నుండి వచ్చాక మీ నాన్ననోసారి మా ఇంటికి రమ్మను" చెప్పారాయన. రాము సరేనన్నట్లు తలూపి ఇంటికెళ్లాడు. సాయంత్రం తండ్రి పొలం నుండి రాగానే మాష్టారు చెప్పిన సంగతి చెప్పాడు.

"పంతులుగారు నన్నెందుకు రమ్మన్నారు? నిన్ను బడి మాన్పించానుగా. అదే మాట్లాడ్డానికయ్యుంటుంది. సర్లే... నేనెళ్తాను. నువ్వు నాలుగు కావిళ్లు నీళ్లు తీసుకురా" కొడుక్కి పని పురమాయించి, మాష్టారింటివైపు బయల్దేరాడు వీరయ్య.

వీరయ్య వెళ్లేటప్పటికి మాష్టారు





ట్యూషన్ పిల్లలకు పాఠాలు చెప్తున్నారు. వీరయ్యను చూసి, "రావయ్యా వీరయ్యా! పొలం నుండి ఇప్పుడేనా రావడం?" బురద కాళ్లను చూసి, అడిగారు మాష్టారు.

"అవునండీ! ఇప్పుడే వచ్చాను. ఇంతలో మావోడు మీరు రమ్మన్నారని చెప్తే వచ్చాను. ఏంటయ్యా! నాతో ఏమైనా పని పడిందా?" అరుగు మీద కూర్చుంటూ అడిగాడు వీరయ్య.

"అవును వీరయ్యా! రాము నాలుగు రోజుల్నుండి బడికి రావట్లేదు. అడిగితే నువ్వు వెళ్లొద్దన్నావని చెప్పాడు. ఇంట్లో ఏమైనా ఇబ్బందా?" నేరుగా విషయానికొచ్చారు మాష్టారు.



"మీకు తెలియని దేముందండీ! నేను, వాళ్లమ్మ ఇద్దరం కూలి పనికెళ్తేనే ఇల్లు గడవడం కష్టంగా ఉంది. అట్టాంటిది వాడి పుస్తకాలనీ, ఫీజులకనీ డబ్బులెక్కడి నుండి తెచ్చేమి? ఏదో ఓపిక వున్నంతవరకు చదివిచ్చాం. ఇక మావల్ల కావట్లేదయ్యా. అందుకే బడి మాన్పించాను" పరిస్థితి వివరించాడు వీరయ్య.

"మీ ఇంటి పరిస్థితి నాకూ తెలుసు. కానీ రాము చాలా మంచి పిల్లవాడు. చదువులో అందరికంటే ముందుంటాడు. అలాంటి వాడు బాగా చదువుకుంటే వృద్ధిలోకొస్తాడు. వాడికి బంగారంలాంటి భవిష్యత్తు ఉంది. కష్టాలకు భయపడి వాణ్ణి బడి మాన్పించడం నాకిష్టంలేదు. ఇంకొక్క ఏడాది కష్టపడితే పదో తరగతి పూర్తవుతుంది. అప్పుడు ఏదో ఒకటి ఆలోచించొచ్చు కదా" అన్నారు మాష్టారు.

"పంతులుగారూ! వాడి చదువు మధ్యలో ఆపడం మా ఇంట్లో ఎవరికీ ఇష్టంలేదు. కానీ తప్పని పరిస్థితి. ఎటూ పాలుపోకనే వాణ్ణి బడి మాన్పించాను" చెప్పాడు వీరయ్య.

"పోనీ... ఓ పని చేద్దాం. ఈ రెండేళ్లపాటు రాము చదువుకయ్యే ఖర్చంతా నేను భరిస్తాను" అన్నారు మాష్టారు.

"మీరు భరిస్తారు సరే. మరి మిగతా వాళ్లేమనుకుంటారో..." అనుమానంగా అడిగాడు వీరయ్య.

"టీచరమ్మగారిని గురించి ఆలోచిస్తున్నావా? మంచి పని ఏదైనా ఆమెకు నచ్చుతుంది. ఇక రాము సంగతి నాకొదిలెయ్. రేపటి నుండి వాణ్ణి బడికి పంపు. సరేనా!" అన్నారు మాష్టారు.

"అయ్యా! మీ మేలు మరువలేను..." కృతజ్ఞత నిండిన గొంతుతో అన్నాడు వీరయ్య.

"అంత పెద్ద పెద్ద మాటలెందుకు గానీ.... రేపు వాణ్ణి తప్పకుండా బడికి పంపాలి. సరేనా?" అన్నారు మాష్టారు. వీరయ్య అలాగేనన్నట్లు తలూపి ఇంటికెళ్లాడు.



మరుసటి రోజు బడికెళ్లే సమయానికి రాము మాష్టారింటికెళ్లాడు.

బడికి బయల్దేరుతున్న మాష్టారు వాణ్ణి చూసి, "రామూ... బడికొస్తున్నావా? లేక మళ్లీ ఏదైనా సమస్య వచ్చిందా?" అని



అడిగారు.

"లేదండీ! నేను ఇవాల్టి నుండి మళ్లీ బడికొస్తున్నాను. ఆ విషయం మీకు చెప్పి వెళ్దామనే వచ్చాను" అన్నాడు రాము.

"ఐదు నిముషాల్లో నేనూ వచ్చేస్తాను. అందాకా ఏదైనా పుస్తకం చదువుకో" చెప్పి, ఇంట్లోకెళ్లారు. మరో ఐదు నిముషాల్లో బయటికొచ్చారు. గురుశిష్యులిద్దరూ రోడ్డు మీద నడుస్తున్నారు.

"రామూ! నిన్ను చదివించడానికి మీ అమ్మానాన్న చాలా కష్టపడ్తున్నారు. వాళ్ల కష్టాన్ని వృథా కానివ్వకు. నువ్వు బాగా చదువుకొని వృద్ధిలోకి రావాలి. నలుగురికీ సాయపడాలి. సరేనా!" అన్నారు మాష్టారు.

"అలాగేనండీ. కాకపోతే నాకు ఇంగ్లీష్ గ్రామర్ సరిగ్గా రాదు. ఏమైనా డౌట్‌లు వుంటే చెప్పించుకోవడానికి మీ ఇంటికి రావచ్చా?" అడిగాడు రాము.

"ఎప్పుడైనా రావచ్చు. నీకు ఏ డౌట్ వచ్చినా నన్నుగానీ, టీచరమ్మగారినిగానీ అడుగు. మేం క్లియర్ చేస్తాం. ఇంకో సంగతి నువ్వు కూడా రోజూ ఉదయం, సాయంత్రం ట్యూషన్‌కి రా..." చెప్పారు మాష్టారు.

"అలాగేనండీ. మరి ట్యూషన్ ఫీజు..." నసిగాడు రాము.

"నేను నా డైరీలో రాసుకుంటాలే. నువ్వు సంపాదించిన నాడు ఇద్దువుగానీ. మరో విషయం... ఇప్పటినుండి కష్టపడి చదివితేనే పదో తరగతిలో ఎక్కువ మార్కులు తెచ్చుకోగలవు. ఎక్కువ మార్కులు వస్తేనే కాలేజీలో నీకు స్కాలర్‌షిప్ వస్తుంది. అప్పుడు ఎవరి సహాయం లేకుండా నీ అంతట నువ్వే చదువుకోవచ్చు. ఇది మాత్రం మర్చిపోకు" చెప్పారు మాష్టారు.

"అలాగే సార్. మీరు చెప్పినట్లే కష్టపడి చదువుతాను" స్థిరంగా అన్నాడు రాము.

చూస్తుండగానే రెండేళ్లు గడిచిపోయాయి. రాము మాష్టారుకిచ్చిన మాట నిలబెట్టుకున్నాడు. జిల్లా స్థాయిలో ఎక్కువ మార్కులు తెచ్చుకున్నాడు. స్కాలర్‌షిప్ సాయంతో పై చదువులు కొనసాగించాడు. ప్రస్తుతం సైంటిస్ట్‌గా దేశానికి సేవలందిస్తున్నాడు.

అయితే రాము ఉన్నతి గురించి గంగిరెడ్డి మాష్టారికి తెలియదు. ఎందుకంటే... రాము కాలేజీలో చేరిన కొన్నాళ్లకు ఆయనకు వేరే ఊరు ట్రాన్స్‌ఫర్ అయ్యింది. కొన్నాళ్లపాటు ఉత్తరప్రత్యుత్తరాలు నడిచాయి. ఆ తర్వాత అవీ అరుదయ్యాయి. దాంతో గురుశిష్యుల మధ్య దూరం పెరిగింది. కానీ మాష్టారు చెప్పిన మాటలు మాత్రం రాము మర్చిపోలేదు. నలుగురికీ సహాయం చేస్తూ ఆయన అడుగుజాడల్లోనే నడుస్తున్నాడు.

## దేశమంటే....



దేశమంటే....
కాదోయ్ చిత్రపటం
కాదోయ్ భూభాగం
దేశమంటే మనుషులోయ్

-వికాస్



# గుడి - నుడి 1

(పద ప్రహేళిక)

ఆచార్య నండూరి గోవిందరావు

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | * | 3 | 4 |
| | * | | * | 5 | | |
| * | 6 | * | 7 | | | |
| * | | * | 8 | | | * |
| 9 | | | * | | * | 10 |
| 11 | | * | 12 | * | 13 | |
| | * | 14 | | | | |

కింద ఇచ్చిన దీర్ఘ చతురస్రంలో అడ్డు, నిలువు ఆధారంతో ఎంపిక చేసుకొన్న పదంతో పూర్తి చేయండి. పదంలో ఉండాల్సిన అక్షరాల సంఖ్య ఆధారం పక్క బ్రాకెట్టులో ఇవ్వబడింది. ఇవి ఒక రకమైన పొడుపు కథలు. నక్షత్రం ఉన్న గడిని ఖాళీగా వదిలి వేయవచ్చు. కరెక్టు సమాధానాలు ఇదే సంచికలో వేరే పేజీలో ఇవ్వబడ్డాయి. వీనితో మీ సమాధానాలను పోల్చి చూసుకోండి.

**ఆధారాలు**

**అడ్డం :**

1. ప్రధాన నగరం; ముఖ్యపట్టణం (4)
3. కెరటం, తరంగం (2)
5. అరవై తెలుగు సంవత్సరాలలో రెండవది (3)
7. వాల్మీకి రచించిన రామకథాకావ్యం (4)
8. డబ్బు (3)
9. ఆవుల కొట్టం (3)
11. తక్కెడ; మేషానికి ఏడోరాశి (2)
13. రేగు - తుమ్మ మొలగు మొక్కల ముళ్ళమండ (2)
14. పూదేనె (5)

**నిలువు :**

1. నూలు వడికే యంత్రం, చరఖా(2)
2. వడ్లు - మినుములు - గోధుమలు మొదలైనవి (2)
3. రక్షణ (4)
4. ఉప్పు (3)
5. గాలి మోటారు, యంత్ర సహాయంతో ఆకాశంలో తిరిగేది (4)
6. బడి, బాలబాలికలు చదువుకొనే చోట (4)
7. కృష్ణుడి ప్రియురాలైన గోపిక; కర్ణుణ్ణి పెంచిన తల్లి (2)
9. లోతైనగుంతలు (3)
10. వేడిమి (3)
12. పక్షిరెక్కలో భాగం (2)
13. కూరదినుసుగా ఉపయోగపడే గడ్డను భూతలము క్రింద తయారు చేసే మొక్క(2)

**(సమాధానాలు 49 వ పేజీ చూడండి)**



# రూపాయి కథ




- తాతయ్య

మీరంతా రోజూ స్కూలుకు వెళ్లేటప్పుడు మీ అమ్మో, నాన్నో అర్ధరూపాయో, రూపాయో ఇస్తారు. ఇవ్వకపోతే ఏడ్చయినా సంపాదించు కొంటారు. ఏ ఐస్‌క్రీమో లేక ఏదో చిరుతిండో కొనుక్కొని తింటారు. మీరు గుర్తించారో లేదో ఇవాళా రేపు అర్ధ రూపాయ కన్నా తక్కువ డబ్బులేనేలేదు. నిన్న మొన్నటి దాకా 25 పైసల బిళ్లలుండేవి. కాని అవి కనుమరుగైపోతున్నాయి. అయినా ఇక పైసలు ఇస్తే స్కూలు గేటు బయట కొనుక్కోవడానికి ఏమీ దొరకదు. కదా. నా చిన్నప్పుడైతే (ఇపుడు నాకు 82 సంవత్సరాలు) పైసలు, ఏగానులు, కానీలు, అణాలు, బేడలు వుండేవి. బేడ అంటే రెండణాలు, అణా అంటే నాలుగు కాన్లు, కానీకి రెండు ఏగానులు, ఏగానికి రెండు పైసలు. అప్పట్లో ఒక పైసా ఇస్తే కడుపు నిండా తినడానికి పకోడీలు కొనుక్కొనే వాళ్లం. అరణా ఇస్తే నాలుగు ఇడ్లీలు దొరికేవి. ఒక కాని ఇస్తే పెసరట్టు ఇచ్చేవారు. అప్పట్లో రూపాయకు 16 అణాలు. ఇవన్నీ బ్రిటిష్ వాళ్లు పరిపాలించినపుడు మారకం విలువలు.

స్వతంత్రం వచ్చిన కొన్ని



సంవత్సరాల తర్వాత ఈ మారకాలు, విలువలు మారిపోయాయి. రూపాయకు నూరు నయాపైసలనే లెక్క వచ్చింది. అర్థరూపాయ అంటే 50 నయా పైసలు, కొంత కాలం తరువాత నయా పైసలను నేరుగా పైసలుగా పిలుస్తున్నాం. పావలా అంటే 25 పైసలుగా మార్పు వచ్చింది. ఈ మార్పు వచ్చిన తర్వాత 5, 10 పైసల నాణాలు చలామణీలోకి వచ్చాయి. ఇవి ఇపుడు ఎక్కడా కనపడటంలేదు. ఇప్పటికే 25 పైసలు నాణాలు దాదాపు కనపడుటలేదు. అర్థ రూపాయి, రూపాయలు మాత్రమే కనపడుతున్నాయి. ఇటీవల రెండు రూపాయల నాణాలొచ్చాయి. ఇపుడు అర్థ రూపాయి, రూపాయ నాణాలు కూడా కనపడకుండా పోయే రోజులు దగ్గరలోనే వున్నాయనిపిస్తుంది. కొద్దిగా వెనక్కి వెళ్ళి ఒకసారి గమనిస్తే ఈ నాణాలు చలామణిలోకి రాకముందు పరిస్థితి ఎలా వుందో ఒకసారి చూద్దాం.



వేల సంవత్సరాల పూర్వం నాణాలనేవి లేనేలేవు. జనం అంతా అడవుల్లో నివసించేవారు. అపుడు బియ్యం, కూరలు, పాలు, పెరుగులాంటివి ఉండేవే కావు. మాంసమే వాళ్ల ఆహారం. జంతువుల్ని వేటాడి చంపి వాటి మాంసాన్ని వండకుండానే తినేవారు. అప్పట్లో మార్కెట్లు లేవు, కొనుక్కోవడాలూ, అమ్మడాలు అసలే లేవు. పిట్టను కొట్టి, పొయ్యిలో పెట్టి వాళ్లు బతికేవారు. పొయ్యిలో పిట్టా అని అన్నాను కదూ... అపుడు పొయ్యి వెలిగించడం లేనేలేదు. యాదృచ్ఛికంగా రాయి రాయి రాపాడినపుడు నిప్పు రవ్వలు వచ్చి కట్టెలు మండడం చూచి, అప్పటి నుంచి నిప్పు రాజేయటం నేర్చుకొన్నారు. కాలం గడిచిన కొద్దీ వారికి అనేక విషయాలు తెలుస్తూ వచ్చాయి. పంటలు పండించటం నేర్చుకొన్నారు. అప్పట్లో జనం గుంపులు గుంపులుగా నివసించేవారు. పంటలు పండించటం, పళ్లు ఫలాలు పెంచటం నేర్చుకొన్నారు. ఒక గుంపు పండించినవి వారు తినగా మిగిలితే ఇంకో గుంపుకు ఇచ్చి ఆ గుంపు దగ్గర వున్న వేవో తెచ్చుకునే వారు.

ఈ ఇచ్చిపుచ్చుకోవడాలు పెరుగుతూ రావటంతో కొనుగోళ్లు అమ్మకాలు సమాజంలో చోటు చేసుకున్నాయి. మొదట తోలు నాణాలు తర్వాత మెటల్ నాణాలు చలామణిలోకి వచ్చాయి. ఈ విషయాలు చదివిన మీకు చాలా చాలా ప్రశ్నలు అడగాలనిపిస్తుంది కదూ? అదో పెద్ద కథ. పెద్దవాళ్లయిన తర్వాత చరిత్ర పాఠాల్లో మీకు అన్నీ తెలుస్తాయి.

మళ్లీ ఇప్పటి రూపాయ నాణాల కథలోకి వద్దాం. బ్రిటిష్ వాళ్లు పరిపాలించినంత కాలం రూపాయలు అచ్చంగా వెండితో తయారు చేసేవారు. ఇపుడు మనం చేసే రూపాయలో వెండి అనేది లేనేలేదు. ఏదో మెటల్‌తో తయారు చేస్తున్నారు. పాత రోజుల్లో ఉన్న అణాలు, పైసలు ఎందుకిలా అదృశ్యమై పోయాయ్? బజారుకు వెళ్లి ఏమి కొనుక్కోవాలనుకున్నా డబ్బు కావాలి. డబ్బిచ్చి మనకు కావాల్సిన



వస్తువులు కొని తెచ్చుకొంటాం. అయితే ధరలు పెరుగుతుండటం వల్ల ఇది వరకు అణాలు, పైసలు ఇస్తే దొరికే సరుకు, ఇపుడు రూపాయలు చెల్లిస్తేనేగాని దొరకటం లేదు. ఇది వరకు మీ అమ్మ భోజనంలో రెండు కూరలు, పచ్చడి, సాంబారు, పెరుగు, అరటి పండు పెడుతూంటే ఇపుడు ఒక కూర, చారు, మజ్జిగ మాత్రమే భోజనంలో కనిపిస్తున్నాయి. మీరు మారాం చేస్తే బజారులో ధరలు మండిపోతున్నాయిరా అంటుంది. అంటే రూపాయి బజరుకు తీసుకొని వెళ్లితే సంచినిండా కూరలు అపుడు దొరికేవి ఇపుడు దొరకటం లేదు. అంటే రూపాయలు విలువ తగ్గిపోయిందన్నమాట.

ఇది వరకు ఎన్.టి. రామారావు ముఖ్యమంత్రిగా వున్నపుడు రెండు రూపాయలకు కిలో బియ్యం అమ్మించాడు. చంద్రబాబు వచ్చిన తర్వాత బియ్యం కిలో అయిదు రూపాయలైంది. అవే బియ్యానికి ఇది వరకు రెండు రూపాయలు చెల్లిస్తే ఇపుడు అయిదు రూపాయలిస్తేనేగాని దొరకటం లేదంటే రూపాయి విలువ పడిపోయిందన్న మాట. కిలో అంటే వేయి గ్రాములు అంటే బియ్యం ధర పెంచకముందు వేయి గ్రాములు రెండు రూపాయలకు వస్తే ఇపుడు అవే రెండు రూపాయలకు 200 గ్రాముల బియ్యం వస్తున్నాయి. మీ నాన్న జీతం కూడా ఆ మేరకు పెరిగితే ఫర్వాలేదు. కాని జీతం అంటే వుంటే మీ భోజనంలో అయిటమ్‌లు ఆ మేరకు తగ్గిపోతాయి. మీరు పిల్లలు, స్కూలు నుంచి వచ్చి, ఆటలాడి ఇంటికి వచ్చేసరికి బాగా ఆకలేస్తుంది బాగా తినాలి. అలా తినకపోతే ఆరోగ్యం పాడైపోతుంది. నీరసం వస్తుంది. హోం వర్క్ చేయబుద్ధి పుట్టదు. స్కూలులో టీచర్ తిడుతుంది. క్లాసులో ఇతర పిల్లల ముందు షేమ్, ఏడుపస్తుంది. ఇదర్రా రూపయి కథ అంటే మీరు వూరుకోరు. మీ మనస్సుల్లో అనేక ప్రశ్నలు తలెత్తుతాయ్. అవేమిటో నాకు తెలుసు. వచ్చే సంచికల్లో మళ్లీ కలుద్దాం.

---

# మిత ఆహారం...

**గురజాడ విజయశ్రీ**



గుత్తివంకాయ కూర
చూస్తేనే నోరూర
తిన్నావు కడుపార
మోతాదు హద్దుమీర
అదే వచ్చింది తంటా
కడుపంతా మంట
తిరిగాయి నీళ్ళు నా కంట
అమ్మ తిట్లపంట
వద్దంటే నేనెక్కడ వింటా

డాక్టర్ అంకుల్ వచ్చారు
నాన్న నన్ను చూపించారు
మందు రాసిచ్చారు
చల్లరసం త్రాగించారు
మళ్లీ ఇట్లా తింటే నీ
పొట్ట కోసేస్తా నన్నారు
అ...మ్మో...



# అగ్గిపుల్లలు మాయం, కోరుకుంటే ప్రత్యక్షం

**ప్రదర్శన :** చిన్న చిన్న వస్తువుల్లో ఎంతో చిత్ర విచిత్ర విన్యాసాలు సృష్టించాడు భగవంతుడు అంటూ – దీన్ని ప్రసాదించిన నిప్పు స్వామికి ముందుగా నా నమస్కారాలు అంటాడు. అగ్గిపెట్టె చేతిలోకి తీసుకొని దండం పెడతాడు. అందులో నుండి ఒక అగ్గిపుల్లను తీసి వెలిగిస్తాడు. మంత్రదండం త్రిప్పుతూ మంత్రాలు చదువుతాడు. క్రింద నుండి అగ్గిపెట్టె అరను పైకి నెడతాడు. నిండు అగ్గిపుల్లలున్న పెట్టెను అందరికీ చూపుతూ, మంత్రిస్తూ లోపలున్న అరను క్రిందికి నెట్టి ధ్యానముద్రలోకి జారిపోతాడు. తిరిగి కండ్లు తెరుస్తూ లోపలున్న అరను పైకి నెడతాడు. విచిత్రం....పుల్లలన్నీ మాయం, అది ఖాళీ అగ్గిపెట్టె... పుల్లలు అదృశ్యమైపోవడం అందరికీ ఆశ్చర్యంగా ఉంటుంది.

**అంతరంగం :** ఒక అగ్గిపెట్టెను తీసుకొని అటు వంటి బొమ్మగల ఇంకొక అగ్గిపెట్టె బొమ్మను కత్తిరించి వెనుక వైపున అంటించాలి. రెండువైపులా అదే బొమ్మ కనిపించాలి అన్నమాట. పుల్లలుండే దాన్ని వెలుపలికి తీసి పుల్లల్ని తీసేయాలి. దాని వెనుకకు త్రిప్పి ఫెవికాల్ లేదా బంకతో పుల్లల్ని ఒకదాని ప్రక్కన ఇంకొకటి పేర్చుకుంటూ అంటించాలి. పుల్లల మధ్యన ఖాళీ వీలైనంత తక్కువగా ఉంచాలి. బాగుగా



ఆరనివ్వాలి. చూచుటకు అది నిండు అగ్గిపుల్లలున్నట్లు కనిపిస్తుంది. రెండో వైపు ఖాళీ భాగం దర్శనమిస్తుంది.

అతికించని ఒక పుల్లను వెలిగించి చూపుతారు.

**గమనిక :** కుడి చేతితో అగ్గిపెట్టెను పట్టుకుని జనంవైపు త్రిప్పి అందులో పుల్లల్ని చూపాలి. మాయం చేస్తానని చెప్పి ఎడమ చేతితో పెట్టెను మూసివేయాలి. ఎడమ చేతిలోకి అగ్గిపెట్టెను తీసుకుని మంత్రాలు చదువుతూ, తెలివిగా నటిస్తూ కుడిచేతి వ్రేలుతో అడుగు నుండి పెట్టెలోపలి భాగాన్ని పైకి నెట్టాలి. లోపలి అర పైకి వస్తుంది. కానీ పుల్లలుండవు. మూతి మీద అదే బొమ్మ ఉన్నందున అగ్గిపెట్టె తిప్పారన్న అనుమానం రాదు.



# గర్వభంగం...

-జ్యోతి ఎ.



తెలివితేటలతో బలమైన సింహం రాజును చంపేసి రాజుగా అధికారాన్ని చెబట్టిన కుందేలుకు గర్వం వచ్చింది. తన కంటే తెలివిగల వారు ఎవరూ లేరని తన తెలివితో అడవిలోని మిగతా జంతువులపై అధికారం చేయువచ్చని భావించింది. అందరూ తనను ఏమి ప్రశ్నించకుండా, తన ఆజ్ఞలను తప్పనిసరిగా పాటించాలని అనుకొంది. దాంతో మిగతా జంతువులను చులకనగా చూస్తూ, ఎగతాళి చెయ్యటం ప్రారంభించింది. ఇతర జంతువుల మధ్య గొడవలు పెట్టి ఆనందించటం అలవాటుగా చేసుకొంది. అయినా, బలమైన మృగరాజుని తన తెలివితేటలతో చంపేసి కాపాడిందని కృతజ్ఞతతో మిగతా పెద్ద జంతువులైన ఏనుగు, పులి, నక్క లాంటివి కూడా కుందేలును ఏమీ అనకుండా కుందేలు దుచ్చేష్టలను సహించాయి. దీంతో కుందేలు ఆగడాలకు హద్దు లేకుండా పోయింది. మిగతా జంతువులు పైకి ఏమీ అనకపోయినా లోపల మాత్రం కుందేలు పొగరును ఎలాగైనా అణచాలని అనుకుంటూ ఉండేవి.

అడవి మధ్యలో ఓ నది ప్రవహిస్తూ ఉంది. ఆ నది ఓ చోట బాగా వంపు తిరిగి పారుతుంది. అందువల్ల ఆ ప్రదేశం పూల చెట్లతో ఫలవృక్షాలతో చాలా అందంగా ఉంది. ఆప్రదేశంమంటే కుందేలుకు చాలా ఇష్టం. అక్కడ దానికి కావలసిన దుంపలు, పండ్లు, కాయలు, పుట్టగొడుగులూ పుష్కలంగా దొరికేవి. అవి తింటూ, నదిలో నీరు త్రాగి సాయంత్రం దాకా అక్కడే ఆడుకుని చీకటి పడ్డాక ఇంటికి వెళ్ళేది.

అయితే, రాచరికంవల్ల వచ్చిన గర్వంవల్ల కుందేలుకు ఏదో ఒక అల్లరి పని



చేయకుండా నిద్రపట్టదు. ప్రతి రోజు ఏదో ఒక జంతువును అల్లరి పెడితే కాని నిద్రపోయేది కాదు.

ఒక రోజు నదీ తీరానికి వచ్చి కుందేలు నదిలో రెండు నీటి పాముల్ని గమనించింది. ఒక పాము నది ఎగువ ఒడ్డున ఉండగా రెండవ పాము దిగువ ఒడ్డున ఉన్నది. అయితే ఆ రెండు పాములకు ఆవలి ఒడ్డున ఇంకో నీటి పాము ఉన్నట్లు తెలవదు. తాను కాక ఇంకో పాము ఉన్నట్లు తెలువదు. దేని కదే ప్రశాంతంగా జీవనం సాగిస్తుంది. నదిలోని చేపల్ని, కప్పల్నీ తింటూ చాలా బలంగా పెరిగాయి.

ఈ రెండు నీటి పాములు ఇంత ప్రశాంతంగా ఉన్నాయి కదా. వీనిని ఏడిపించి అల్లరి చేస్తే ఎలా ఉంటుంది? అవి ఎంత తెలివి తక్కువ జంతువులో, నేనెంత తెలివైన దానినో మరోసారి నిరూపించుకోవచ్చు. దాంతో మిగతా జంతువులకు నేనంటే ఇంకా భయంగా, మర్యాదగా మసులుకుంటాయి. గర్వంతో అధికారం తలకెక్కిన కుందేలు అనుకున్న వెంటనే నదికి ఎగువ వైపు ఉన్న పాము దగ్గరకు వెళ్ళి "ఏయ్ పామూ, నన్ను చూడు. నేనెవర్ని? మృగరాజునే చంపిన గొప్ప కుందేలును కదా! నన్ను చూస్తే నీకు భయం లేదా! నన్ను చూసి కూడా చూడనట్లే ఉంటావు. మర్యాద ఇవ్వాలని తెలీదూ నీకు? నీ గురించి ఏమనుకుంటున్నావు? చాలా బలమైన వాడ్ననుకుంటున్నావా? అంత బలముంటే నాతో పోటీ పడి గెలవగలవా?" అంటూ రెచ్చగొట్టింది. దాంతో పాముకు



కోపం వచ్చి పందేనికి రడీ అంది. సరిగ్గా అలాగే మాట్లాడి దిగువ ఉన్న పామును కూడా పందేనికి ఒప్పించింది.

తరువాత కుందేలు అడవిలోకి వెళ్ళి అడవి తీగల్ని తాడులా అల్లి తీసుకొచ్చింది. తాడు ఒకకొనను మొదటి పాముకు, రెండవ కొనను రెండవ పాముకు ఇచ్చి, "రెండో చివర నేను పట్టుకుంటాను. దూరంగా వెళ్ళి 'లాగు' అని అరుస్తాను. అప్పుడు నువ్వు గట్టిగా లాగడం మొదలుపెట్టు. నువ్వు నన్ను ఓడిస్తే నీకు ఆహారమవుతాను. నువ్వు ఓడిపోతే, రోజూ నన్ను నదిలో నీ వీపు మీద కూర్చోపెట్టుకుని షికారుకు తీసుకెళ్ళాలి." అని పందెం కాసింది. పాము సరేనంది. అలాగే, రెండో పాముకి కూడా చెప్పి, తాడు రెండో కొసను అందించి, దూరంగా వెళ్ళి లాగు అని అరిచింది.

పాములు రెండూ తాడును బలంగా లాగడం మొదలు పెట్టాయి. అమ్మ కుందేలు నిజంగా బలమైందనే అనుకున్నాయి. దాంతో బలమంతా ఉపయోగించి తాడును లాగడం మొదలుపెట్టాయి. పోటీ తీవ్రంగా జరిగింది. అవి రెండు అలా హోరాహోరీగా పోటీ



పడుతోంటే, ఒడ్డున ఉన్న కుందేలు క్రిందపడి దొర్లుతూ పొట్ట చెక్కలయ్యేలా నవ్వడం మొదలుపెట్టింది. ఆ నవ్వు విని పాములకు అనుమానం వచ్చి తాడును వదిలేసి గట్టు మీదకు వచ్చాయి. ఒక దాన్ని ఒకటి చూసుకుని తెగ ఆశ్చర్యపోయాయి. వెంటనే కుందేలు చేసిన మోసాన్ని అర్థం చేసుకొన్నాయి. కోపంతో బుసలుకొడుతూ రెండు కలిసి కుందేలు మీదకు దూకి కన్నుమన్నాయి. దాంతో కుందేలు ప్రాణభయంతో పరుగో పరుగు. అధికారంతో వచ్చిన గర్వం దిగిపోయి మామూలు కుందేలుగా మారిపోయింది. వెనుక నుండి పాములు రెండూ ఇంకోసారి ఇటు వచ్చావో నువ్వు ప్రాణాలతో బయట పడవు జాగ్రత్త అని హెచ్చరించాయి.

ఇదంతా చూసి మిగతా జంతువులు 'కుందేలుకు మంచి శాస్తి జరిగింది' అని సంతోషించాయి. అప్పటి నుండి అవి కూడా కుందేలు అల్లరిని సహించడం మానేసి, దాన్ని తరమడం మొదలు పెట్టాయి.

కుందేలు మాత్రం ఇంకెప్పటికీ తనకిష్టమైన ఆ నదీ తీర ప్రాంతానికి వెళ్ళలేకపోయింది. అప్పుడుగాని, దానికి తెలిసి రాలేదు. తనెంత నష్టపోయిందో. దాంతో ఇంకెప్పుడూ గర్వంగా ప్రవర్తించకూడదు అని నిశ్చయించుకుంది.

# మా బాల్యం....

**వికాస**



మా బాల్యం.. మా బాల్యం
నవ్వులే నవ్వులు
ఆటలే ఆటలు
పాటలే పాటలు
ఆడటం, పాడటం, నవ్వటమే
మా పని
పనే పని...

కబుర్లు, మాకిష్టం
కథలంటే మరీ ఇష్టం
ఇదే మా బాల్యం.. మా బాల్యం
మరుపురాని, తిరిగి రాని మా బాల్యం

కుందేళ్ళలా గెంతుతాం
లేగదూడల్లా చెంగున ఎగురుతాం,
పరిగెడతాం
ఇదే మా బాల్యం, మా బాల్యం
మరుపురాని తిరిగి రాని మా బాల్యం
చెట్లతో స్నేహం చేస్తాం
పిల్లి, కుక్క, కోడి, కుందేళ్ళు మా నేస్తాలు
సూర్యుడు, చందమామ మా వారే
అన్ని మా నేస్తాలే
అందరూ మా వారే
ఇవన్నీ ప్రకృతిలో భాగం
మేము కూడా ప్రకృతిలో భాగమే
ఇదే మా బాల్యం..
మరుపురాని, మరువలేని మా బాల్యం



# బోనాలంటే...



హాయ్ బాలలూ! పండగలంటే మనందరికి ఎంతో సరదా. కొత్త చుట్టాలు, రకరకాల స్వీట్లు, బంధువుల రాకపోకలు, ఆటలు, పాటలు. ఈ పండుగలన్నీ మన జీవితంలో ఒక భాగంగా మారాయి. అయితే, ప్రతి పండుగకు ఒక ప్రత్యేకత ఉంటుంది. దానికి సంబంధించిన ఒక కథ ఉంటుంది. బోనాలు, వినాయక చవితి, రాఖీ పండుగల గురించి ఈ నెల తెలుసుకొందాం.

బోనాలు తెలంగాణాలో, ముఖ్యంగా హైదరాబాద్‌లోనూ, దాని చుట్టు పక్కల ప్రాంతాల్లోనూ పెద్ద పండుగ. "భోజనాలు" నుండి బోనాలు పదం వచ్చింది. అంటువ్యాధుల నుండి ప్రజలను కాపాడమని కోరుతూ కాళికామాతకు భోజనాలు సమర్పించుకోవడమే ఈ పండుగ ఉద్దేశ్యం. హైదరాబాద్ నగరంలో 1869లో ప్లేగు వ్యాపించినప్పుడు ప్రజలను రక్షించాల్సిందిగా అమ్మవారిని వేడుకొంటూ బోనాలు ప్రారంభించారని అంటారు. హైదరాబాద్ పరిసరాల్లో ఆషాడమాసం నెలరోజులపాటు బోనాలపండుగ ఒక్కో ఆదివారం ఒక్కో గుడిలో జరుగుతుంది. ఈ నెల మొదటి ఆదివారం గోల్కొండ కోటలోని మైసమ్మ గుడిలో మైసమ్మ బోనాలు జరిగింది. రెండవ ఆదివారం సికింద్రాబాద్‌లోని ఉజ్జయిని మహంకాళి ఆలయంలో, మూడో ఆదివారం పాత నగరంలోని లాల్‌దర్వాజా వద్ద గల మాతేశ్వరీ గుడిలో జరిగింది. ఇవి కాకుండా జంటనగరాల్లోని సుమారు నలభై చిన్నా పెద్దా ఆలయాల్లో బోనాలు జరుగుతాయి. ఆషాడ కొలువులు లేదా ఆషాడ జాతరలు అని పిలిచే బోనాలు పండుగ ప్రధానంగా కాళికాదేవిని వివిధ రూపాల్లో అంటే మహంకాళి, మైసమ్మ, పోచమ్మ, యెల్లమ్మ, గుండమ్మ తదితర రూపాల్లో కొలిచే ఉత్సవం. సంప్రదాయంగా కొన్ని కుటుంబాలకు చెందిన మహిళలు అమ్మవారికి అన్నం, నీరు కుండల్లో పెట్టి సమర్పించుకుంటారు. వీటిని 'ఘటాలు' అంటారు. మహిళ తలమీద పెద్ద ఘటం, ఆపైన చిన్న ఘటం, దానిపై మరింత చిన్న ఘటం ఇలా వరుసగా పేరుస్తారు. కుండలను పసుపు, కుంకుమలతో అలంకరిస్తారు. ఘటాలు మోసే మహిళ పూనకం పొందుతుంది. అమ్మవారు ఆమెను ఆవహించిందని నమ్ముతారు. డప్పుల మోతకు లయబద్ధంగా నాట్యం చేస్తూ ఆమె అమ్మవారి గుడికి వెళుతుండగా ప్రజలు ఆమెను వెంటనడుస్తారు. అమ్మవార్లకు ముందుగా, ఫలహారం బండి ఎదుట పోతురాజు వేషంలో ఒక వ్యక్తి కొరడాతో వంటిపై కొట్టుకుంటూ లయబద్ధంగా అడుగులేస్తూ నడుస్తాడు. వివిధ గృహాల నుండి బయలు దేరే బోనాలతో ఆషాడం ఆదివారాల్లో హైదరాబాదు నగరం సందడిగా తయారవుతుంది. ప్రతి ఇంటి వద్ద ఘటాలు మోసే మహిళను ఆపి కాళ్ళు కడిగి పూజిస్తారు. ఆలయాలకు వెళ్ళలేని ముసలివారు, వికలాంగుల కోసం అమ్మవారే ఇంటికొచ్చిందని భావిస్తారు.



# వినాయక చవితి



వినాయకుణ్ణి గణపతి, గణేష్, గజాననుడు అనే పేర్లతో కూడా పిలుస్తారు. గణవ్యవస్థ నుండే గణేశ్ పేరు వచ్చింది. గణ వ్యవస్థలో ప్రజలు గుంపులు, గుంపులుగా కలిసి జీవించేవారు. ఈ గణాలకి గణాధిపతి లేక గణ నాయకుడు ఉండేవాడు. గణానికి ఆయన అధిపతి. గణ సమాజంలోని తెగ నాయకుల పూజలే ఈ గణపతి పూజలుగా పరిణమించాయని చెబుతారు.

వినాయుకుని పేరులోనే నాయకుడున్నాడు. విఘ్నేశ్వర మూర్తులని, పల్లెల్లో ప్రతి శుభకార్యానికి ముందు గ్రామ నాయకులను సన్మానించే ఆచారం ఉంది. వినాయక చవితి వ్రతంలో వినాయకుడి పుట్టుకకు సంబంధించి చెప్పిన కథ ఇటీవల వచ్చిందే. నిజానికి వినాయక చవితి ఉత్సవాలు జరుగుతున్నది గత రెండువందల యాభై సంవత్సరాలుగా మాత్రమే. అది కూడా ఇప్పుడు మనవాళ్లు చేస్తున్న పద్ధతిలో వినాయక చవితి చేయడం 1894లో ప్రారంభమైంది. శైవమతం బాగా వ్యాప్తి చెందిన 12వ శతాబ్దం నుండి శివరాత్రి, వినాయక చవితి వ్యాప్తిలోకి వచ్చాయని చారిత్రకులు చెబుతారు. పూర్వం వినాయక విగ్రహాలు ఇప్పుడున్న రూపంలో లేవు. వినాయకుడు నిజానికి పంటల దేవుడని కూడా పరిశీలకుల వాదన. వ్యవసాయానికి ఉపయోగించే బొక్కెన (గణపతి తల), తొండం ( తుండం), నాగలి (దంతం), చేట (చెవి), తాడు (జందెం), గాదె (పొట్ట), సమాహార రూపంతో పంటల దేవుడై (ఉండ్రాళ్లు), పైరుల శత్రువైన ఎలుకను (మూషిక వాహనం) తొక్కివేసే కల్పనే నేటి గణేశరూపం అంటారు. వినాయకుని గురించి మరొక కథ కూడా విస్తృత ప్రచారంలో ఉంది. కైలాశంలో పార్వతి భర్త శివుని రాకను తెలుసుకుని నలుగు పిండితో స్నానం చేస్తుంది. ఈ సందర్భంలో వచ్చిన నలుగు పిండితో ఒక బాలుని విగ్రహం తయారు చేస్తుంది. ఈ విగ్రహాన్ని చూసి ముచ్చటపడి ప్రాణం పోస్తుంది. స్నానం సమయంలో సింహద్వారాన కాపలా ఉంచుతుంది. ఈ లోపల శివుడు వచ్చి లోపలికి పోవుటకు ప్రయత్నం చేస్తాడు. కానీ సింహద్వారాన కాపలా గల బాలుడు శివుణ్ణి అడ్డగిస్తాడు. దానికి శివుడు కోపించి తన త్రిశూలంచే బాలుని కంఠాన్ని నరికేసి, లోపలికి పోతాడు. విషయం తెలుసుకున్న పార్వతి దుఃఖిస్తుంది. సమయస్ఫూర్తితో శివుణ్ణి సంతృప్తి పరిచి బాలునికి తిరిగి ప్రాణం పోయుమని అభ్యర్థిస్తుంది. అప్పుడు శివుడు తాను చేసిన పనికి చింతించి తాను తెచ్చిన గజాసుర శిరస్సును బాలునికి అతికించి ప్రాణ ప్రతిష్ట చేస్తాడు. గజాననుడు తల్లిదండ్రులను భక్తితో సేవిస్తాడు.





"టెట్రాసైక్లిన్" రూపొందించిన

# యల్లాప్రగడ సుబ్బారావు

మహారాష్ట్ర, గుజరాత్‌లలో ప్లేగు వ్యాధి ప్రబలినపుడు ప్రతి నోటా వినిపించిన మంత్రం "టెట్రాసైక్లిన్".

పూర్తిగా నిర్మూలించాం. యిక రాదు అని భావించిన ఈ మహమ్మారి మరలా విజృంభించి మానవాళిని కబళించ ప్రయత్నించినపుడు ఊరట కల్గించింది. టెట్రాసైక్లిన్. దీనిని కనుగొన్న ప్రపంచానికి ఆయుష్షు పెంచిన యల్లా ప్రగడ సుబ్బారావు. ఆంధ్రులవటం మనందరికీ గర్వకారణం. 1895 జనవరి 12న ఈ యల్లాప్రగడ సుబ్బారావు ప్రపంచ పౌరుడుగా కీర్తి గడించారు.

అతి సాధారణ కుటుంబంలో జన్మించిన సుబ్బారావు ఒకేసారి అంతర్జాతీయ స్థాయికి చెందిన జీవరసాయన శాస్త్రవేత్త కాలేదు. ఎంతో శ్రమ, పట్టుదల, ఎదురీత, త్యాగం సుబ్బారావుగారి జీవితంలో కన్పిస్తాయి. వారి మహోన్నత వ్యక్తిత్వం, ఉదాత్త జీవితం, గొప్ప పరిశోధనలు మనకు ఎంతో స్ఫూర్తిదాయకం. ఒక రంగంలో అత్యున్నత స్థానం అధిష్టించాలంటే ఒంటరి వ్యక్తి సాగించిన పోరాటం యువతకు ఆదర్శప్రాయం.

ఆంధ్రప్రదేశ్‌లోని పశ్చిమ గోదావరి జిల్లా భీమవరంలో ఒక నిరుపేద కుటుంబంలో సుబ్బారావు 1895 జనవరి 12న జన్మించారు. చిన్నతనంలోనే సుబ్బారావు ఎన్నో కష్టాలు పడ్డాడు. చదువు మీద పెద్ద ఆసక్తి వుండేది కాదు. కాని తల్లికి మాత్రం తన కుమారుడు బాగా చదువుకోవాలని ఆరాటపడేది. అయితే చిన్న సుబ్బారావుకు మాత్రం చదువుపై కాక సన్యాసంపై ధ్యాస మళ్లింది. కాశీ వెళ్ళడానికి ప్రయత్నించాడు. రామకృష్ణ మఠంలో చేరడానికి యత్నించాడు. ఆ ఈ ప్రయత్నాలు విఫలమయ్యాయి. రెండోసారి మెట్రిక్యులేషన్ ఫెయిలయ్యాడు. తర్వాత మద్రాసు హిందూ హైస్కూల్‌లో చేరాడు. అక్కడ చేరిన కొద్ది రోజులకు ఆయన తండ్రి మరణించాడు. అప్పుడు తల్లి వెంకమ్మ పుస్తెలు అమ్మి పరీక్ష ఫీజులు కట్టి రైలు ఛార్జీలు ఇచ్చింది. ఈ సంఘటన సుబ్బారావును కలచివేసింది, ఎంతో పరివర్తన కల్గించింది. కార్యోన్ముఖుని చేసింది. అదే అతన్ని జీవిత శిఖరాలు ఎక్కించింది.

మారిపోయిన సుబ్బారావు



మెట్రిక్యులేషన్, ఇంటర్మీడియెట్‌లు ప్రథమశ్రేణిలో పాసయ్యాడు. చుట్టూ సమాజంలో వున్న పేదరికం, అనారోగ్యం, అకాల మరణాలు అతన్ని ఆలోచింపచేశాయి. అందువల్ల వైద్య విద్యపై ఆయన మనసు మళ్లింది. వైద్యవిద్య సాగుతున్నప్పుడు కూడా ఆయనకు ఆర్థిక ఇబ్బందులు తప్పలేదు. అయినా అతని అకుంఠిత దీక్ష, ఆత్మవిశ్వాసం అతన్ని ముందుకు నడిపించాయి. వైద్యవిద్య ఐదో సంవత్సరం చదువుతున్నప్పుడు అతనికి మేనమామ కూతురు శేషగిరితో వివాహమయ్యింది. తర్వాత 'స్ప్రూ' వ్యాధి సుబ్బారావు అన్నను బలి తీసుకుంది. దీనితో పూర్తిగా వికలమయిన సుబ్బారావు మనసు వైద్య పరిశోధనవైపు మళ్లింది. ఇది ఆయన జీవితంలో రెండవ మలుపు. అటువంటి పరిస్థితులలోనూ గాంధీజీ బోధనలు ఆయనను ఆకట్టుకున్నాయి. ఖద్దరు ధరించి స్వాతంత్ర్య సమరంలో దూకారు. అందువల్ల పరీక్ష బాగా వ్రాసినా, ఇంగ్లీషు ప్రొఫెసర్లు ఆయన్ను ఫెయిల్ చేశాయి. తర్వాత అన్నను బలి తీసుకున్న 'స్ప్రూ' ఇతనికి కూడా సోకింది. అయితే మృత్యువు నోట్లోంచి బయటపడి బ్రతికిపోయాడు. ఆయుర్వేదం, అల్లోపతి మేళవించి 'స్ప్రూ'కు మందు కనుక్కోవాలని భావించాడు. ఈ విషయంపై పరిశోధనలు చేయాలంటూ హార్వర్డ్ విశ్వవిద్యాలయం వారికి రాశాడు. ఆయుర్వేదంలో ఉష్ణ దేశాల జబ్బుల గురించి పరిశోధన చేయడానికి 1921లో సుబ్బారావును ఆహ్వానించారు.



కానీ ఆర్థిక సహాయం కల్పించలేదు. అయితే కొందరి సహాయంవల్ల గర్భవతిగా ఉన్న భార్యను వదలి అమెరికా వెళ్ళాడు.

చాలా రకాల విష జ్వరాలకు సర్వరోగ నివారణిలా పని చేసే యాంటిబయాటిక్ కనుగొనాలని భావించాడు. 'ఆరియోమైసిన్' (బంగారు రంగు వుంది కాబట్టి) తయారు చేయగలిగారు. ప్రకృతి విపత్తువల్ల వచ్చిన విచిత్ర విష జ్వరానికి గురైన రోగులకు ఈ మందు యిచ్చారు. ఆశ్చర్యకరమైన రీతిలో వారు కోలుకున్నారు.

ఆ తర్వాత దాదాపు అరశతాబ్దం ఈ టెట్రాసైక్లిన్, ఆరోమైసిన్, దాని మిగతా మందులు ఎన్నో రోగాలకు తిరుగులేని ఔషధంగా పని చేశాయి. తన సోదరుని ప్రాణాలు బలిగొన్న 'స్ప్రూ' వ్యాధికి నిత్య పరిశోధన చేసి 'ఫోలిక్' ఆసిడ్ తయారు చేశారు. ఈ వ్యాధికి విటమిన్ బి12 అనేది కూడా మందు అని కనుగొన్నారు.

దాదాపు పది సంవత్సరాల వ్యవధిలో టెట్రాసైక్లిన్, ఫోలిక్ ఆసిడ్, అమినో స్పిరిక్‌లనే కాకుండా బోదకాలుకు మందును కొనుగొన్నాడు. బి కాంప్లెక్స్‌ల్లో చాలా వాటికి ప్రత్యామ్నాయాలను కనుగొనగలిగాడు. యల్లాప్రగడ సుబ్బారావుగారి శతజయంతి సందర్భంగా 1995 జనవరి 12న భారత ప్రభుత్వం అతని స్మారకార్థం ఒక పోస్టల్ స్టాంప్‌ను విడుదల చేసింది.



## కంగారు పేరెలా వచ్చింది?

ఆస్ట్రేలియా జాతీయ మృగం కంగారు అని మనకు తెలుసు. దానికి మనం మన తెలుగు అర్థం చూసుకొని నవ్వుకొంటుంటాం. అయితే దానికి ఆ పేరు రావడానికి కారణం ఉంది. 1770లో ప్రఖ్యాత నావికుడు కెప్టెన్ కుక్ ఆస్ట్రేలియా తీరంలో కాలు పెట్టగానే కనిపించిన జంతువులను చూచి చాలా ఆశ్చర్యపడ్డాడు.



వాటికి కడుపుపై సంచిలాంటి భాగంలో తమ పిల్లల్ని దాచుకొని విచిత్రంగా ఉన్న వాటిని చూసి దగ్గరలో ఉన్న ఆస్ట్రేలియా ఆదివాసిని దాని పేరేమిటని అడుగగా అతను 'కాన్‌గురు' అని సెలవిచ్చాడట. దాంతో కుక్‌గారు దాన్ని 'కంగారు'గా ప్రచారంలోకి తెచ్చారు. కాని అది ఆస్ట్రేలియా ఆదివాసి దృష్టిలో కాన్‌గురు అంటే నాకేమి బోధపడటం లేదు అని అర్థమట. కంగారు పేరు చాలా కంగారులో వచ్చింది కదూ!

## దేశభక్తి అంటే...



దేశభక్తి అంటే ...
కాదోయ్ హారతులివ్వటం
కాదోయ్ ఇతరులను ద్వేషించటం
దేశభక్తి అంటే దేశ ప్రజలను ప్రేమించడం
॥ దేశమంటే ॥

మనమంతా భారతీయులం
భారతీయులందరిని ప్రేమిద్దాం
ప్రేమించి గౌరవిద్దాం
ఇదే మన దేశ భక్తి అని తెలుసుకోవోయి
ఇదే నిజమైన దేశ భక్తి అని తెలుసుకోవోయ్
ఇదే మన దేశభక్తికి గీటురాయి
ఇదే మన గొప్పదనం
ఇదే మన గౌరవం
॥ దేశమంటే ॥

– వికాస్

### గుడి-నుడి - 1 సమాధానాలు

**అడ్డం:** 1. రాజధాని 3. అల 5. విభవ 7. రామాయణం 9. గోశాల 11. తుల 13. కంప 14. మకరందం

**నిలువు:** 1. రాట్నం 2. ధాన్యం 3. అభయము 4. లవణం 5. విమానము 6. పాఠశాల 7. రాధ 9. గోతులు 10. తాపము 12. ఈక 13. కంద





# బావిలోకి దూకిన సింహాలు

-జమ్మి కోనేటి రావు

సింహం కథ వినే ఉంటారు. ఒక సింహం అడవిలోని జంతువుల్లో ఒక దానిని రోజూ తింటూ ఉండేది. దీనిని సహించలేక ఎలాగైనా ఆ సింహాన్ని అంతం చేస్తే బాగుండునని మిగతా జంతువులు ఆలోచించాయి.

ఒక నక్కకి బ్రహ్మాండమయిన ఆలోచన తడుతుంది. వెంటనే సింహం దగ్గిరకి వెళ్తుంది. "జంతునాయకా! మన అడవిలోకి నీకు పోటీగా మరొక సింహం వచ్చింది" అని అంటూ ఒక వార్తని భయం భయంగానే అందిస్తుంది. సింహానికి వెంటనే కోపం వస్తుంది. "ఎక్కడ, ఏదీ, దాని పని పడతాను" అంటూ కోపంతో ఊగిపోతుంది. నక్క నయవంచకు రాలుకదా. వంగి వంగి భయం భయంగా నెమ్మదిగా సింహాన్ని ఒక బావి వద్దకు తీసికొని పోతుంది. అందులో ఉంది చూడు సింహ నాయకా అంటుంది నక్క. సింహం గట్టెక్కి చూడగానే దిగువ నీట్లో తన ప్రతిబింబం కనబడుతుంది. దాన్ని చుట్టూ వెంటనే గర్జిస్తుంది. ఆ గర్జన నూతిలో నుంచి బయటకు వచ్చి తిరిగి దానికి వినబడుతుంది. "ఆహా! నా మీదనే గర్జిస్తున్నావా నీ అంతు చూస్తాను" అంటూ సింహం నీళ్ళలో దూకుతుంది. మునిగి చచ్చిపోతుతంది.

పీడ విరగడయిందనుకొన్నాయి జంతువులన్నీ. ఇంతకీ ఈ కథ ఎందుకు చెప్పాల్సి వచ్చింది అంటే ఇలాంటి కథలో కొంత వాస్తవం లేకపోలేదేమో అనుకోవలసి వస్తోంది.

మన దేశంలో సింహాలు గిర్ అడవుల్లో మాత్రవే ఉన్నాయి. చాలా తక్కువగా వందల్లోనే ఉన్నాయి. గత అయిదేళ్ళలో దిగుడు బావుల్లో 37 సింహాలు పడిపోయాయిట. కొన్నిటిని బయటకు లాగినా 19 చనిపోయాయిట. ఇటీవలే రెండు సింహ పిల్లలు కూడా ఇలా పడి మరణించాయిట.

ఇంతకీ ఈ కథలో మాదిరిగా సింహాలు తమ బింబాన్ని చూసి కోపంతో దూకుతున్నాయా లేక ప్రమాదవశాత్తు జారి పడుతున్నాయో తెలియదు కదా. సింహాలు నూతిలోకి దూకటం కట్టుకథలు కాదేమో!

Edited, Printed, Published & Owned by Dr. A. Prasad Rao, H.No. 1-9-312/3/G1, Vidyanagar, Hyderabad - 500 044, AP. Printed at Prajasakti Daily Printing Press, 1-1-60/2, RTC 'X' Roads, Hyderabad - 500 020, AP. Published at H.No. 1-1-187/1/2, Viveknagar, Chikkadapally, Hyderabad-500020, AP. **Editor: Dr. A. Prasad Rao**



**మనసు ఫౌండేషన్**

**పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVM02A106 |
| పుస్తకం పేరు | మామయ్య |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | M. Lavanya |
| పేజీలు విడదీసినది | M. Lavanya |
| స్కాన్ చేసినది | Rakshitha |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |